# సుమతి

రచన

శరత్ బాబు

అనువాదం

లింగమ్

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
గ్రంథప్రకాశకులు : : రాజమహేంద్రవరము.

# ఒకటి

రామ్‌బాబు ఏండ్లకు చిన్నయేగాని ఆగతాయిపనులకు అంతులేదు. ఆ జమిందారీ గ్రామమంతా అతనిపేరుఅంటే సింహస్వప్నములా వుంటుంది. అతను జేసే అల్లరి యేవైపున, ఎప్పుడే స్వరూపాన బైటకుబుకుతాదో చెప్పలేము. ఊహాతీతములుగా వుంటాయి. అతని సవతితల్లి కుమారుడు యితనికంటె పెద్దవాడు శ్యామలాల్. అయితే కోపిష్టి శాంతము తక్కువ. అయినా యింకో సుగుణం వుంది. తమ్ముడేదైనా తప్పుజేస్ని చిన్నతప్పుకు పెద్దశిక్ష విధించే వాడుగాడు. అవూరి జమిందార్‌గారి కచ్చేరిలో ఉద్యోగముజేసుకుంటూ తన ఆస్తిని కాపాడుకొంటూ కుటుంబమును నిల్పుకొని వస్తుయున్నాడు. ఆస్తి కొద్దిపాటిగాదు. భూస్వాములలో ఒకడు - తోటలున్నాయి, ఇల్లువుంది. రొఖ్కరూపేనావుంది. ఆ గ్రామములో పలుకుబడివుంది. తనుపిలుస్తే వచ్చి సహాయపడుటకు కొంత అల్ప జనులున్నారు తనచేతిలో. శ్యామలాల్ భార్య నారాయణి కాపురానికి వచ్చినది. ఆ సంవత్సరమే రామ్‌బాబు విధవతల్లి చనిపోయింది. పోయ్యేటప్పుడు యీ పెద్దసంసారాన్ని యేటనర్థం పిల్లవాడైన యీ రామ్‌బాబుని. పదునాలుగు వత్సరములునిండని తన కోడలు నారాయణి చేతులలో వప్పజెప్పి పోయింది.

ఈ సంవత్సరము ఆ చుట్టుపట్ల పది ఆమడలమద్య యెక్క-డజూచినా మలేరియా జ్వరములే; మనిషిరక్తాన్ని పిరిసి మంచాని కూలవేస్తుయున్నాయి. పాపము శ్యామలాల్ యింటగూడ ప్రవేశించింది. నారాయణికి ఆ జ్వరము పట్టుకొంంది. ఆ చుట్టుపట్ల కొన్ని గ్రామాలకు ఒకే ఒక డాక్టర్ నీలమణిసర్కా-రు వున్నాడు. ఆయినయే ప్రాక్టీస్ చేస్తోన్నాడు. ఆయన పూర్తిగా డాక్టర్ పరీక్ష కాలేదు, అయినప్పటికీ ప్రాక్టీస్ బావుంది. యీ మద్య గిరాకియెక్కు-వగా వుండుటచే విజిటింగ్ ఫీజ్ ఒకరూపాయినుండి రెండురూపాయివర్కు-పెంచినాడు. పైగా మలేరియా జ్వరములకు క్వినైన్‌లో మైదాకలపటంమూలాని తినుబండారంలా తయారైంది. వారం పదిరోజులు గడిచినా; నారాయణికి జ్వరం తగ్గుమొఖం పట్టలేదు. శ్యామలాల్‌కు విచారం పట్టుకొంంది.

డాక్టరును తీసుకురావడానికి వెళ్లిన నృత్యకాళీ ఆయింట దాసీది వెళ్ళితిరిగివచ్చి "ఈవేళ ఆయనకు పక్క-గ్రామములో డబుల్‌గా విజిటింగ్ ఫీజువచ్చే చాన్సువుందిట. అచ్చటకు పోవాలట! అందుచే యిక్క-డకురాలేమని చెప్పమన్నారండీ!" అంది.

ఆ మాట శ్యామ్‌లాల్‌కు విసుగు కోపంగల్గింది "అడబుల్ ఫీజు నే మాత్రం యివ్వలేనా? డబ్బుఎక్కు-వా? ప్రాణం ఎక్కు-వా? ఛో, నీవుపోయి వాడ్ని పిలుకుకొనిరా" అనిగర్జించేడు.

యీ పల్కు-లన్ని గదిలోపలనున్న నారాయణి చెవిని పడ్డాయి. ఆమె గద్గదస్వరముతో భర్తనుపిలుస్తూ "మీరంత తొందరపడు టెందుకండీ? డాక్టర్ బాబు యీ వేళరాకపోతే రేపువస్తారా మే.

యీ ఒక్కరోజులో యేమంతముంచుకు పోతుందండీ ? గాభరా గాభరా పడిపోతారెందుకు అనవసరంగా " అంది ఆమె.

యీ మాటలు రామ్‌బాబు పెరటిలో జామిచెట్టుక్రింద కూర్చుని పంజరము తయారుజేస్తున్నవాడు విని చరచరాలేచివచ్చి " ఆగవే కాశీ !– నేవెళ్ళి వస్తాను " అన్నాడు.

మరిది వెళ్ళగాననడమువిని నారాయణి చటన మంచముపై లేచికూర్చుని " ఏమండీ రామ్‌బాబుని వెళ్ళవద్దని చెప్పండీ – రామ్‌బాబు నీవువెళ్ళవద్దు. వెళ్లేవా – నామీదవొట్టే నా కన్నకావూ నాచిట్టి తండ్రివి కావూ ! అక్కడకువెళ్ళి ఆయనతోతగదా పెట్టుకోబోక నానా ! " అన్నది.

రామ్‌బాబు ఆ పల్కులు ఆలకించనేలేదు. వెళ్ళిపోయేడు. పెరటిలోనికివెళ్ళి – శ్యామలాల్ కొడుకు అయిదేండ్లవాడు బాబాయే కట్టబోయే పంజరముతాలూకు బద్దలువేసుకొని అక్కడే కూర్చున్నాడు. " పంజరంపూర్తిజేయవా బాబాయ్ " అన్నాడు.

రామ్‌బాబు అటుజూచి " కట్టాలేరా మళ్లావచ్చి పనివుందంటూ " బైటికి పోయేడు.

" అయ్యోయో మీరు అతనిని యెందుకుబైటికిపోనిచ్చేరండీ ? యీవేళ యింటిపైకేమితీసుకొచ్చి పెడతాడో " అంటూ నుదురుకొట్టుకొంటు ఏడ్వసాగింది నారాయణి.

శ్యామలాల్ కోపముతో " నన్నేం చెయ్యమంటావ్ ? – వాడు తొందరతొందరగా బైటికిపోతేని: నీవు పిలుస్తుంటేఆగాడా ? నేనన్నా అలానే జర్గును "

" నే కేకలెట్టునప్పుడు అడ్డుతగలలేకపోయారా ? యీ దౌర్భాగ్యదామోదరునిమూలంగా ఒకక్షణం వూపిరి తీసుకోలేకపోతు

న్నాను. ఓసి వృత్తికాకే మాయమ్మా! నీకు ఒకగడియఅయినా వృథా పోనీక నీవు వెంటనే వెళ్ళి పొలానికి ఎక్కడున్నాడో జూచి వెంటనే రామ్‌ని రాకమ్మని చెప్పు అమ్మా - పో వాడింకా పొలానికిపోయి వుండడు చూడు" వృత్తికా తొందరకు కేకలెట్టుకొంటూ బైటికి వెళ్ళింది.

రామ్‌బాబు తిన్నగా నీలమణి డాక్టరుగారింటికి వచ్చేడు. అతనువచ్చే సమయానికి డాక్టర్ దిక్కున్నరీలోపున తలపులూడి పోయిన టేబులు దగ్గర పాత బెంచ్‌పై త్రాసుపెట్టుకొని మందులు తూస్తూ కూర్చున్నాడు. ఆ చుట్టూ అయిదారుగురు రోగులు నోర్లు తెరచుకొని త్రాచుమైపు జూస్తూ నిల్చున్నారు. డాక్టర్ లోనికి వచ్చిన రామ్‌బాబుని క్రీగంటితో జూచి, తన యూనిఫామును జూచు కొంటూ యున్నాడు.

రామ్‌బాబు రెండునిముషములు అక్కడ పరిస్థితులు పరిశీలనజేసి "మావదినకు జ్వరము పోలేదెందుచేతనయ్యా?" అని అడిగేడు.

డాక్టర్ త్రాసు తూనిక వైపునే దృష్టినుంచి, తలపైకెత్తకనే "నే మందుయిస్తూనేవున్నా! నన్నేమిజేయమంటావు?" అన్నాడు.

"మందుకాదు, నీవు యిస్తున్నది. మైదామాత్రలుజేసి మందు అని మాయజేసి యిచ్చినంతమాత్రాన జ్వరం తగ్గుతుందా?"

ఆ మాటలు వింటూ నీలమణిడాక్టర్ త్రాసుతూనిక అన్నిమరిచిపోయి నోరు మెదపకుండా కళ్ళలో నిప్పులు చెరుగుతూ అతని వైపుజూస్తు, "యీ ప్రపంచంలో యింత నిర్భయముగా మాట్లాడ

గలవ్యక్తి వున్నాడనికూడా అతనికి తెలియక ఆశ్చర్యపోతున్నాడు " ఒక్కనిముషమూరుకొని " అయితే అబ్బాయీ, అదిమైదాపిండి మాత్రలేనట్టే వాటినితీసుకెళ్ళుమని నీవెందుకు చెప్పవు ? మీయన్న కాళ్లు పట్టుకొనిఅయినా డాక్టరుని తీసుకురమ్మని కబురంపటం దేనికనిరా? " యని లేని గాంభీర్యము తెచ్చుకొని గద్దించేడు.

" యీ ప్రాంతంలో మరో డాక్టర్ లేడు గాబట్టి నిన్నేరమ్మని కబురంపించి వుండవచ్చును. యింకో డాక్టర్ వున్నట్లయితే నిన్ను పిలవకనేపోవచ్చును ? "

అక్కడున్నవారంతా వెలవెలబోతూ యీ మాట్లు వింటూ చూస్తోన్నారు. వాళ్లవైపు తిరిగి రామబాబు అన్నాడు. " నీవు జాతిలో తక్కువవాడవు గాబట్టి బ్రాహ్మణుల మంచిచెడ్డలు తెలుసుకొనలేకపోయేవు. అందుచేతనే మా యన్ననిన్ను కాళ్లుపట్టుకు తీసుకురామని కబురుచేసినట్టున్నాడు. మా యన్న యెవరికాళ్ళు పట్టుకోడు పట్టుకొనే రకంకాడు. వచ్చేటప్పుడు మా వదినవొట్టు వేసుకొంది గాని లేకపోతే యిప్పుడే నీకు దేహశుద్ధి జేసేవాడిని. యేం డాక్టర్ నీకు యిదే చెప్పుతున్నాను - మంచిమందు తీసుకువెళ్ళి యివ్వు యీవేళ జ్వరం పూర్తిగా తగ్గలేకపోతే విను - నీవు వేయించిన అంటు మామిడతోట రేపీపాటికి మొక్కలు బుర్రలు వొంచేయన్న మాటే. తరువాత యీ డిస్పెన్సరీ సీసాలు, కుర్చీలు, బెంచీలు, చెత్తచెదారంగా మారిపోతాయి " అంటూ పెద్దపెద్దకేకలు వేసుకుంటూ బైటికి వెళ్ళిపోయేడు.

డాక్టర్ త్రాసుచేతిలో అలానేవుండగా చేతులు వణుకుతూ తెల్లబోయి : రాము వెళ్ళినదిక్కున చూస్తూ వుండిపోయేడు.

వక ముసలివాడు – ధైర్యము జేసి, "డాక్టర్ బాబు యిక మీరు ఆలస్యం మాత్రం జేయక వేగిరిపడండి. మంచిమందు నాచేరేమో జూచి పట్టుకెళ్ళి యివ్వండి. యెంత తొందరగా వెళ్ళితే అంత మంచిది లేదా? – రామ్‌బాబు చెప్పినపంతా చేసితీరేరకం" అన్నాడు.

డాక్టర్ కొంచెం తేరుకొని గ్రాసు పక్కనపడవైచి "ఆ యెంత మాటన్నాడు. సరే నేనిప్పుడేపోయి పోలీస్ – సబిన్‌స్పెక్టర్‌తో చెప్పుతాను. యిందుకు మీరంతా సాక్ష్యులేగా యిక్కడ జర్గిన దానికి!" అని అన్నాడు.

"సాక్ష్యమా? సాక్ష్యం యెవ్వరు చెప్పుతాడు బాబు. మీరిచ్చే క్వినైన్ వలనే నా చెవులు పూడిపోయేయి. ఆ రామ్‌బాబు యేమి చెప్పేడో నేవింటేగా నీకు సాక్ష్యంగా రావడానికి వినలేదు బాబు. వినలేదు. పైగా ఆ రామ్‌బాబు చూడడానికి చిన్నవాడేగాని; ఆయనకున్న పిల్లగాయలమూక మాత్రం చిన్నదిగాదు. ఆ యిన్‌స్పెక్టర్ బాబు యేంజెయ్యగలడయ్యా డాక్టర్ బాబూ? ఆ దేవుడు కోపంవచ్చి ఇంటికి నిప్పుపెట్టి తగలెట్టాడంటే; పోలీసువాళ్లు సమీపానికైనరారు యీ ఇన్‌స్పెక్టర్ పూతికపుల్లంత సహాయమైనా చేయలేడు. చెయ్యలేడు. సాక్ష్యంఅవీ మావల్లకానిపనులు. అతడంటే యీ చుట్టు పక్కల అందరకూ భీతాహమే – గాబట్టి మీరు తక్షణంపోయి వారు జెప్పిన పనిజేసిరండి" అని ఆ ముసలివాడు సలహాయిచ్చి "చూడండి నా చెయ్యి. యీ వేళకొంత జావ త్రాగమంటారా?" అన్నాడు.

డాక్టర్ ముసలివాని మాటలువిని హృదయంలో కుతకుత లాడుతుంది. యీమాట చెయ్యిచూడండనేసరికి మండిపోతూ

"సాత్యమియ్యమంటే యివ్వలేనన్నారే అట్టి మీకు నేమందు లియ్యాలా ఫో, పొండి. మందులులేవు-మాకులులేవు. చచ్చినాసరే మందులివ్వను" అని గదమాయించేడు.

ముసలివాడు తన కర్రపూత తీసుకొని పైమీద బట్టవేసుకుంటూ. "డాక్టర్‌గారూ ఇందులో యెవ్వరితప్పలేదు. అతడో పెద్ద పిశాచిలాటివాడు. అతడికీ సంగతిచెప్పి మరిపోవాలి లేదేని పోలీస్ స్టేషన్‌కు పొమ్మని సలహా మేమే యిచ్చేమనుకొని మాతోటలు, భూమి అంతా పెళ్ళగించి పారేస్తాడు. అందుకు సందేహమేలేదు. ఆ అల్లరిపిల్లకాయలు రాత్రికి నిద్రపోరు. మీ డిస్పన్సరీ రేపుయిక్కడ వుండను వుండదు. డాక్టర్‌బాబు యీ మాటవినండి - పోలీస్ స్టేషన్‌కు రేపైనా పోవొచ్చుగాని మంచిమందు తీసుకొని ముందు అక్కడకుపొండి. అప్పటికి రామ్‌బాబు-శాంతపడగలడు" అంటూ వృద్ధుడు వెళ్లినాడు. మిగతా నలుగురు నెమ్మదిగా బైటికి దారితీసి వెళ్లినారు.

నీలమణిడాక్టర్ దీర్ఘంగా ఆలోచించి - ఆలోచించి నిట్టూర్చి మానవజీవితములో శేష అనుభవాన్ని ప్రపంచములో సర్వోత్కృష్ట మైన జ్ఞానసూత్రాన్ని మననం జేసుకుంటూ బైటికి వెళ్లేడు "యీ విశాలప్రపంచములో మంచిఅనేది చెయ్యకూడదు" అనుకొంటూ.

నారాయణి రామ్‌బాబు వెళ్ళినప్పటినుండి యెప్పుడొస్తాడా యని కిటికిలో కూర్చుని జూస్తునేవున్నది - ఆతురతతో.

రామ్‌బాబు యింటికివచ్చి గోవింద్‌ని జూచి "పంజిరము కట్టిపెట్టుతా రారా!" అని కేకవేసినాడు.

నారాయణి ఆ కేకవిని " రామ్ యిలారా " అంది. రాముడు జామిచెట్టుక్రింద నీడలోకూర్చుని ఎదురుబద్దలు సన్నగా చీల్చుతూ " ఇప్పుడు నే రాలేనువదినా పనిలోపడివున్నానని " అన్నాడు.

" చటమని, ఓతూరి రమ్మనుటలేదు ? " అనిగద్దించి కేక వేసింది నారాయణి. రామ్‌బాబు బద్దలుఅన్ని అక్కడ వోమూల పారవేసి, నారాయణివున్న గదిలోకి మెల్లగావెళ్ళి ఓబల్లమీద మూల వెళ్ళి కూర్చున్నాడు. " డాక్టర్‌బాబు కన్పించేరా నీకు ? " అన్నది.

" ఆఁ కన్పడినాడు "

" యేమన్నావు నీవు ఆయినతో ? " అంది.

" రమ్మని, అన్నా "

నారాయణికి అతనిమాటలో నిజం చిక్కలేదు. అందుచే ఆమె అన్నది. " వట్టినే రమ్మనిమాత్రం చెప్పివచ్చేవా ? "

రామ్‌బాబు మెదలక తలవంచుకొని వూరుకొన్నాడు.

" ఆఁ. ఆయినతో యింకేమి చెప్పేవోచెప్పు బాబు ఊఁ చెప్పు—"

" నే చెప్పను " అన్నాడు రామ్.

యింతలో దాసీ నృత్యకాళి బిరబిరవచ్చి " డాక్టర్‌బాబు వస్తున్నారమ్మా " అంది.

నారాయణి దుప్పటికప్పుకొని పక్కకుతిరిగి పడుకొంది. ఒక్కనిముషములో శ్యామలాల్‌తోకలసి డాక్టర్‌బాబు లోన ప్రవేశించేడు. అదిజూచి రామ్‌బాబు నెమ్మదిగా అక్కడనుండి జారిపోయేడు. డాక్టర్ చెయ్యవలసిన కృత్యాలుజేసి ; వచ్చీరావడంతో నాడీ

పరిశీలించి - మందిస్తు " అమ్మా ! జ్వరం నయమవుట నయము గాకపోవుట డాక్టర్ల చేతిలోవుందా ? మీ మరది రామ్‌బాబు నాకు ఒకరోజు టైము పెట్టేడు. యీ యిరువదినాల్గుగంటలలో జ్వరం తగ్గిందా సరేసరి లేదా మాఇల్లు తగలపెట్టుతానన్నాడు. యిది ధర్మ మేనా అమ్మా ? " అన్నాడు.

నారాయణి సిగ్గుతో " అతను ఆదేమాటలే అలావుంటా యండీ మీరేమీ భయపడకండి అలాచెయ్యడు" అంది.

" అతనికి ఓ పెద్దముఠావుందని అంటూవున్నారు. వూరివా రందరూనూ, వాళ్ళు — మీ వాడు చెప్పినంతా జేస్తారట ! యీ విష యములో మాకు చాలా భయముగాఉందితల్లీ ? మేము మందంటే ఇవ్వగలముకాని. ప్రాణాలను యివ్వగలమా ? " అన్నాడు.

నారాయణి ఒకగడియతాళి. " వాడెప్పుడో ఎక్కడో ఒనాడు శ్రీకృష్ణజన్మస్థానానికి వెళ్ళేవాడని నాకుతెలుసు అయితే వాడితో పాటు మేము వెళ్ళవలసివుంటుందని తలపోస్తువున్నా "

ఈ రోజున నీలమణి డాక్టర్ తనగదిలో ఓమూలజాగ్ర త్తగా దాచిన క్వినైన్ తీసితెచ్చేడు ఆ మందు యిచ్చి వాటిని యేవిధముగా వాడాలో పత్య పానాలు యేవిధముగా జేయాలో చెప్పి వెళ్ళిపోతుంటే శ్యామ్‌లాల్ విజిటింగ్‌ఫీజ్ నాలుగు రూపాయలు చేతిలోపెట్టబోయేడు. " వద్దు-వద్దండీ నా ఫీజ్ ఒక్క రూపాయిమాత్రమే అంతకంటే యెక్కువమాత్రం తీసుకోలేను. అలా తీసుకొనే పద్ధతి నా కేకోశాన్ని లేదు. శ్యామ్‌బాబూ ! డబ్బు శాశ్వితముకాదు. మాటమాత్రం చాలా కాలముండి పోతాది. ఒక్క రూపాయి ఇయ్యిబాబు " అన్నాడు.

రెండు దినాల క్రిందట యిక్కడే రెండురూపాయిలు తీసుకున్నమాట మరిచిపోయ్యేడు పాపం - శ్యామ్‌బాబు విషయాన్ని అంతా వెంటనే గ్రహించకలిగేడు. ఒక్కరూపాయే చేతబెట్టి పంపించి వేసేడు. ఏమయితేనేమి నారాయణికి తిరిగి ఆరోగ్యం చేకూరింది. సంసారం మామోలుగా సాగిపోతూవుంది.

# రెండు

రెండు మాసాలు గతించిపోయిన వెనుక వొకనాడు నారాయణి నదిలో స్నానమాడి వస్తునే బుజానవున్న నీళ్ళబిందె దింపి "నృ౦శీ కాళీ ఆ కోతిఎక్కడే ?" అని పెద్దకేక వేసింది.

"కోతి" అంటే యెవ్వరోగాదు రామ్‌బాబు అని ఆయింటి లోవున్న అందరికి తెలియును.

"చిన్నబాబుగారు యిప్పుడిక్కడే వున్నారమ్మా" అంటూ అటుజూచి "ఆఁ అదిగో అక్కడ గాలిపటం యెగరవేస్తూ యున్నా రమ్మా" అంది.

నారాయణి వాన్నిజూచి "యిలారా పాపిష్టివాడా ! నువ్వు పెట్టే యీబాధలతో నన్ను కంఠానికి ఉరిపోసుకు చావమంటావా యేం చెప్పు" అంది.

రామ్‌బాబు వెలగకాయ చిప్పలోనుంచిగుంజు పైకివ్రేలితో మీటుతూ ఎదటికివచ్చి నిలబడ్డాడు.

నారాయణి అంది. "శాంతారామ్ దోసముక్కలు ఒక పక్కఅంతా పెల్లగించి పారేశివచ్చేవేం ?"

"నే పెళ్లగిస్తుంటే ఆయనచూసే చెప్పేడా యేం?"

"వాళ్లు చూడకపోతేనేం నేజూచి అడుగుతున్నా ఎందుకు పెల్లగించావోచెప్పు ?" అంది.

"ఆ యింటిలో ఆ ముసలి వరద నన్నెందుకు తిట్టాలి ?"

"తిట్టడం సంగతి ఆవలుంచు. నీవు దొంగతనముగా దోసకాయలెందుకు ఎత్తుకపోవాలి ? ఆ సంగతి ముందుతెల్పు...?" అంది మండిపడిపోతూ నారాయణి.

రామ్‌బాబు ఆశ్చర్యంతో కోపగించుకొంటూ "ఆఁ ఏం నేను దొంగతనము జేసెనా ? కొన్ని కాయలువెళ్లి కోసుకున్నానంతే. అంతమాత్రము అది దొంగతనమౌతుందా ?" అన్నాడు.

నారాయణి మరింత కోపముతెచ్చుకొని "ఔతుందీ కోతి అది దొంగతనము గాకపోతే మరేటి ? ముమ్మాటికి అదే దొంగ తనమంటారు. పెద్దవాళ్లు యేలాంటివి దొంగతనమంటారో యీ కాలములో పసి బాలబాలికలకుకూడా తెలుసు. నీకు మాత్రం తెలియనట్లు బుల్లిపాపాయిలా మాట్లాడుతున్నావు. బుద్ధిలేనివాడా ? ఒక్క గంట నీవు వొంటికాలిమీద నిలబడు అదే నీక్కుశిక్ష నిలబడ వేం !" అంది.

యీ యింటిలో పిల్లవాడు గోవింద్ రామ్‌బాబుకు కుడి బుజములాంటివాడు. యిరువైనాలుగు గంటలు రామ్‌బాబు వెంట వంటియుండి రామ్‌బాబు చెప్పినపనులన్ని జేస్తుయుంటాడు. వాడు యిప్పటివర్కు రామ్‌బాబు తనచేతికిచ్చిన గాలిపటమును పట్టుకు అలానేవున్నాడు గాని, రామ్‌బాబుకు శిక్షపడినప్పటికి ఆ గాలిపటం వదలి మెల్లగా తల్లిపక్కకు జేరుకున్నాడు.

రామ్‌బాబు తటపటాయించుట వాడుజూచి "బాబాయ్ ఇదిగో యీలా నిలబడాలి చూడు" అని తనువొంటి కాలిపైనిల బడి జూపినాడు.

రామ్‌బాబు "ఛా నోరుమూయ్‌రా" అనివాడ్ని కోపపడి తను ఒంటికాలిమీద నిలబడ్డాడు.

నారాయణి వస్తున్నా నవ్వుని ఆపుకొని రా రా గోవింద్ అని వాడ్ని చంకనిడుకొని తనగదిలోనికి వెళ్లిపోయింది. రెండు గడియలు పోయేక మళ్లీవచ్చి జూచింది. రామ్‌బాబు అలానే నిల బడి కళ్లంబటవొచ్చె నీళ్లని తనచొక్కా అంచుతో తుడుచుకొంటు యున్నాడు. ఆదృశ్యం జూచిన నారాయణికి కళ్లనీళ్లు గిర్రున తిరిగేయి.

"సరే అయిపోయిందిలే శిక్ష యిక లేచిరా. గాని, యిక నెప్పుడు అలా చేయక" అంది నారాయణి.

రామ్‌బాబు ఆ మాట ఆలకించనట్లు. అలావే వొంటికాలుపై నిలుచుని వచ్చేకన్నీళ్లను తుడుచుకొంటు "ఉ ఊఁ రాను యీలా నేవుంటా" నన్నాడు. నారాయణి వానివద్దకెళ్లి చెయ్యపట్టుకు లాగింది. వాడు బిగబెట్టిఅలానే నిలుచున్నాడు. నవ్వుకొంటూ యీదపాగట్టిగా లాగేటప్పటికి వాడు చెయ్యివిదలించుకు అక్కడ నుండి రివ్వున పారిపోయేడు.

ఒకగంటగడిసేక. దాసీ నృత్యకాళీ ఆవైపునుండివస్తు జూచింది రామ్‌బాబును. చండీ మండపం వసారాలో దక్షణవైపున స్థంభాన్ని ఆనుకొని కూర్చున్నాడు.

"స్కూల్‌లోకివెళ్లే వేళఅవరేదా చిన్నబాబూ? అమ్మగారు పిలుస్తున్నారు రండీ!" అంది. రామ్‌బాబు విననట్లు జవాబు చెప్పక తనుఅలానే కూర్చున్నాడు కదలక.

నృత్యకాళి ఎదుటకొచ్చి "రండీ చిన్నబాబుగారు స్నానం జేసి బడికివెళ్లుదురుగాని. అమ్మగారు వంటజేసి సిద్ధముగా కూర్చున్నారు. ఆలస్యంచేయకరండి అమ్మగార్ని ఎందుకలా తికమకలు పెట్టి బాధిస్తారు బాబుగారూ!" అంది.

రామ్‌బాబు! కళ్లుపెద్దవిజేసి నీవు అనవసరంగా యిక్కడ ఉపన్యాసము లివ్వక్కరలేదు. నీవు వెంటనే పో. యిక్కనుండి వెళ్లిపో" అన్నాడు.

"పోతాగాని అమ్మాగారేమన్నారో విన్నారా మీరు" అంది.

"వినను. వినదలచుకోలేదు, స్నానంజేయను. భోజనానికి రాను. నువ్వుయిక్కడనుండి వెళ్లు" అనిగర్జించాడు.

"సరే యీ మాటలే అమ్మగారితో చెప్పుతాను" అని వెళ్ళిపోయింది నృత్యకాళి.

రామ్‌బాబు యింతలో యేం బుద్ధిపుట్టిందోకాని తటాలున లేచి చెరువులో స్నానంజేసి; తడిగుడ్డలతోను తలఅయినా తుడుచుకోకుండా. దొడ్డిదారిని యింటిలో జేరినాడు. యీతడు వచ్చిన విషయం నారాయణి గమనించి అక్కడకువచ్చి అతనినిజూచి "ఓయ్‌దయ్యమా! అదేంపనోయ్. అక్కడ స్నానం జేసేవు ఆ రేవులో దిగినవాళ్లు మునిగిపోతామనే భయంతో కాళ్లుఅయినా కడుగుకోరే. అలాటిది అందులోదిగి స్నానంజేసివచ్చేవా?" అంటూ

నారాయణి ఆ మాట కొంచెము కటువుగా ఉండుటచే "ఆ నువ్వు ఎప్పుడు వాడివయస్సే జూస్తావ్ వాడు పెద్దవాడైనాక విద్యాబుద్ధులొచ్చేక అలా మాఠామ్‌జేస్తూ వాళ్లో కూర్చుంటానంటాడా? కూర్చుంపేంగాని—తిననంటాడా? యేమి నీ చేదస్తాం" అంది.

నృత్యకాళి ఆమెయందభిమానంతో – "మీ మంచికోరి చెప్పేమాటలే నమ్మ! లేకపోతే నాకేంపట్టింది? పన్నెండేండ్లు పైబడ్డాయి యిప్పుడైనా కాస్త బుద్ధిమంతునితనం రాపోతే యింకెప్పుడొస్తాది?" అంది.

నారాయణి కీ మాటలు చాలాకోపం తెప్పించేయి. "జ్ఞానమూ, బుద్ధీ యివియిందరకూ ఒకవయస్సులోనే రావే! పిచ్చిదాన కొందరకు కొంతముందు వస్తాయి. మరికొందరికి వయస్సు పైబడె కొలవి వస్తుయుంటాయి. మంచిగానీ, చెడుగానీ, నీకెందుకు మా రామ్‌బాబు పై అంతఅక్కసు" అంది.

"ఇదీ మీ తప్పేనమ్మా! మీ రామ్‌బాబు యెంతటి అల్లరివాడైనాడో మీరు గ్రహించినారా? మీరూజూస్తునే యున్నారాయే గ్రామంలోవున్న చిన్నా పెద్దా యేమంటువున్నారో మీరొకనాడైనా తెలుసుకొన్నారూ. ఇతడిట్టివాడవుటకు కారణం ముఖ్యముగా వాళ్ల వదిన గారాభమేనంటూ వున్నారు." అంది, నృత్యకాళి.

గ్రామస్థులు నేను జేసే గారాభమే జూస్తూయున్నారుగాని; నేనెంత దండిస్తున్నానో, యెట్లా అదుపు ఆజ్ఞలలో వుంచుతున్నానో; అవియేమయినా వాళ్లకి తెలుసునా? పోనీ నీవువాళ్లో వంటిదానవు గాదుగా రోజూ యీయింటనే వుంటావాయే. అన్నిజూస్తునే వున్నా

వుగా ప్రొద్దున్నంతా వొంటికాలిపై నిలిచి, ఏడ్చి ఏడ్చి, కనుతెర్రబడి మొఖం వాడిపోయివెళ్లి - ఆ పాడుచెరువులో మునిగి వచ్చేడు. తడి బట్టలతో జ్వరమేవొస్తుందో, తలనొప్పే వొస్తుందో ఆ భగవంతునికే తెలియాలి. అయినాకూడా తిండిపెట్టకమాడ్చి స్కూలుకు పంపమంటావా ? ఇంటా బైటా ఇంతనిందలను నేపడలేనే కాళీ!" అని ఆమె అంటువుండగానే కంఠధ్వని మారి, కళ్లవెంబడి నీళ్లు జల జల రాలసాగేయి. పమిటచెంగుతో కళ్లుతుడుచుకొని. "యీపని గొడవపైననే నిన్నరాత్రి భర్తతో తగువులాడవలసివచ్చింది." యీ సంగతి నృత్యకాళికి తెలియదు. ఆమె చిన్నబోయి పెదిమి కొరుక్కొనుచు. "అదేమిటమ్మా ? అలా ఏడ్చుతారేమిటి ? విన కూడనిమాటేమి అనలేదే నేను. గ్రామస్థులంతా యీలా అంటూ వున్నారుగాబట్టి; మీపైని పడవేసి హెచ్చరికమాత్రం చేసేను" అంది.

నారాయణి కళ్లు తుడుచుకొంటూ "దైవమందర్ని ఒకేవిధముగా సృష్టించడే కాళీ! అతను అల్లరివాడని, యెవ్వరేమన్నా మెదలకుండా కూర్చున్ననా ? కాగా నే గారాబంగా జూస్తానంటారు. గాక యేం చెయ్యాలని వారభిప్రాయం ? బుర్రబద్దలకొట్టి చెర్వులో పడేసిరమ్మంటారా ? లేకపోతే కాళ్లువిరగగొట్టి దొడ్డిలో పారెయ్యమంటారా ? అలాజేస్తే బహుశా వారికి హృదయభారం తగ్గుతుందనుకుంటా ?" అని జవాబుకొరకు జూడక చరచరా తనగదిలోకి వెళ్లిపోయింది.

నృత్యకాళి వెలవెలబోతూ "ఇదంతా అయోమయంగా వుంది. అనేక విషయాలలో, వివేకము, ధైర్యముగల యీమె

యీ విషయాన్ని గ్రహించలేకపోయింది. పైగా చాలాకఠినమైన శిక్షవేసిందేమో ? పిన్నిగారు ఒక్కింతసేపు వాకిటికావైపెళ్ళి ఏడ్చినంత మాత్రాన. ప్రపంచం తారుమారైందనుకున్నట్లుంది," అనుకొంటూ చకచకా పైకి అక్కడనుండి వెళ్ళిపోయింది.

భోజనానికి అన్నగారితోకలిసి కూర్చోవటంఅంటే రామ్‌బాబుకు యిష్టముండేదికాదు. యీ వేళ ఆవిషయం తనకు తెలుసుండి నారాయణి అన్నదమ్ములిద్దరకూ ఒక్కచోటగ్గిరనే వడ్డించి తను ఎదురుగా కూర్చుంది, రామ్‌బాబు గదిలో ప్రవేశించి వడ్డనవైపు ఓతూరిచూచి. ఒక్కగంతు వెనక్కువేసి " ఈవేళ నేనన్నము ముట్టను. నా కక్కరలేదు లెండి ? అని అన్నాడు.

"అయితే పోయిపడుకో" అని గంభీరముగా అంది నారాయణి ఆమె గంభీరస్వరాన్ని గ్రహించే - వాని అలుకఅంతా మటుమాయమై పోయింది. గాని విస్తరిముందు కూర్చోనలేదు. అలానే నిలబడి ఆలోచిస్తు వున్నాడు.

శ్యామలాల్ మరోగుమ్మంలోనుండి లోనికిరాగానే రామ్‌బాబు పిచ్చుకలా బైటికి పారిపోయేడు. శ్యామలాల్ విస్తరిముందుకూర్చుని యెదట భార్యవైపుచూస్తూ " రామ్‌బాబు భోజనానికి రాలేదేం ? " అన్నాడు.

" ఆ అబ్బాయి నాతో తింటానన్నాడు లెండి ? " అంది నారాయణి.

ప్రశాంతముగా భోజనముచేసి శ్యామ్‌లాల్ అక్కడనుండి వెళ్ళినదే తడువగా రామ్‌బాబు గుప్పెటనిండా ఇసుకపట్టుకొని నేపి

వేళ యెవ్వర్ని అన్నంతిననియ్యను అందరివిస్తర్లలోను ఇసుక జల్లేస్తా" నన్నాడు.

నారాయణి మొఖం పైకెత్తి వానినిజూస్తు "ఊఁ సరేపొయ్యి తెలుస్తుందిమజాకా" అంది.

రామ్‌బాబు కొంచెంతగ్గి "గొప్పమజాకాయే, ఉదయం నన్నుతగజేసి అన్నంతినమని ఇప్పుడు మజావాహూడుఅని డంబాలు జెప్పుతున్నావా?"

"నీవు ఉపయాన్ని ఎందుకు తిన్నావ్?"

"నీవు రాత్రికి నేపెట్టుతా నాయనా-అన్నావా?"

"నీవు ఇప్పుడు పెద్దవాడివైనావు ఇంతా ఇతర్లు కలిపి నీకు తినిపించాలా నీకు సిగ్గుసేయుటలేదూ?" అందినారాయణి.

రామ్‌బాబు వెలవెలబోతూ "యేమిటి ఇతర్ల చేతిమీదుగా ఆఁ. యేమిటంటున్నావూ"

"ఊఁ. పోవోయ్-వెళ్లు ఆ ఇసుక పారివేసి చేతులు శుభ్రముగా కడుక్కొనిరా వెళ్లు, ఇంకెప్పుడు అలాతినకు"

రామ్‌బాబు వదినమాటలయందు యేదో విశ్వాసముంచి ఆమెచెప్పినట్లు ఇసుక బైట పారబోసి చేతులు శుభ్రపర్చుకొని వచ్చి ప్రశాంతముగా విస్తరిముందు కూర్చుని భోజనము చేయుచున్నాడు. అదేసమయములో నృత్యకాళి గుమ్మంవద్దకువచ్చి లోనికి తొంగిచూచి వెళ్లిపోయింది వరండాలోకి.

"రామ్‌బాబు! నీ అల్లరి యేనాటికి తగ్గడమంటు లేనట్లుందే? పరమేశ్వరుడు నీకేనాటికి మంచిబుద్ధి కల్పిస్తాడో? యీ గ్రామంలో

వారు అనేమాటలు-నాకు శూలంపోట్లులా వున్నాయి యిక యీ బాధ సహించలేను బాబు ?" అంది.

రాముడు భోజనముజేస్తు "ఎవరూ వారిపేర్లుచెప్పు" అన్నాడు.

నారాయణి ఓ నిట్టూర్పు విడిచి "ఛఛే! ఛఛే! వారిపేర్లు చెప్పమంటావా ?" అంది. "యెన్నిపేర్లు చెప్పుతానో అన్ని తగవులు ఇంటిమీదికితెచ్చి పడవేస్తావన్నమాట. ఏం అంతేగాదూ"

రామ్ భోజనముజేసి నవ్వుకొంటు బైటికి వెళ్ళిపోయేడు.

నాల్గు వారాలుగడిసేయి. నిజంగా తగవులు రోజూ వచ్చి పడుతూవుండేవి. ఆమె విధవతల్లి - పదేళ్ళకూతురితో యేలాగో ఓలా తన అన్నగారింటివద్ద కాలంగడుపుతూ యుండేది. పాపం ఆ అన్నగారు యిటీవల గుండెజబ్బుతో చనిపోయేడు. యిక అక్కడ ఆమెకు వుండుటకు అవకాశము లేకపోయింది. ఆ విషయం కూతురైన నారాయణికి జాబువ్రాసింది. నారాయణి భర్తతో తన తల్లినిగూర్చి ప్రస్తావించి యీ యింటబెట్టుకొనుటకు వొప్పించి మనిషినిపంపి తల్లిని, చెల్లెలను రప్పించుకొంది. ఆ విధవతల్లి అయిన దిగంబరి వచ్చీరావడముతోనే తన కూతురైన నారాయణిని వశపర్చుకో కలిగింది. రామ్‌బాబుయొక్క పరిస్థితులనుజూచి - వాడ్ని తనచెప్పుచేతలలోనికి తీసుకురావడమునకు విశ్వప్రయత్నం జేస్తు లొంగదీసి ఆ యింటి పెత్తనం తనే వహించుటకు కుట్రలు పన్నుతూవుంది. ఆమె వచ్చినప్పటినుండి రామ్‌పై విద్వేషదృష్టులు పరుపుతూనేవుంది. ఒకనాడు రామ్‌బాబు రావికొమ్మను తీసుకొచ్చి ఆ యింటి నడిమివాకిలిలో పాతిపెట్టుటకు ప్రయత్నిస్తు

యున్నాడు. దిగంబరి యిదంతా జూస్తు " అదేమిటి రామ్! ఆ కొమ్మ అక్కడ వేస్తున్నావే నీకేమైనా బుద్ధివుందా ?" అని గర్జించింది.

రామ్‌బాబు ఆ ముసలామెవైపు జూచి " రావిచెట్టు యెదిగి పెద్దదైతే యెంత నీడయిస్తాదో నీకు తెలుసా ? రావిచెట్టునీడ చాలా మంచిదని మా మేష్టరుగారు అనేక పద్యాయములు మాతో చెప్పేరు." అంటూ ఓ చిన్నగొయ్యితీస్తు " ఒరే గోవింద్ నీవు పోయి నీళ్లతే. ఓ భోలా నువ్వుబోయి లావుపాటి యెదురువాసాలు నాల్గు కొట్టుకురారా దీనిచుట్టు కంచె కట్టకపోతే ఆవులు, దూడలు మొక్కని అమాంతంగా తినేస్తాయి " అన్నాడు.

దిగంబరి చురచుర జూస్తు " నడింవాకిలిమధ్య రావిచెట్టా? అట్టాటియిల్లు నిలుస్తాదా ? యిదెక్కడచోద్యం అమ్మా! నా జన్మలో యింతకాలం పెరిగేనుగాని నే నెక్కడా చూడలేదుబాబు!" అంది.

రామ్‌దామాటలు యేమి పట్టించుకోలేదు. తనపని తను సాగిస్తూ పోతున్నాడు. గోవిందుడు తను తీసుకురాపగినంత చిన్న పిడతతో నీళ్లతెచ్చేడు. అదిజూచి రామ్‌బాబు నవ్వుకొని " అవి యేపాటిరా గోవింద్ — సరిపోవు. యేది నీవు యిక్కడజూస్తువుండు నే యెళ్లితెస్తాను " అని పెద్దకడవ తీసుకొనివెళ్లేడు.

క్షణంలో — కడవతో నీళ్లతెచ్చి గుమ్మరిస్తువున్నాడు. నడిమివాకలి పూర్తిగా తడిపి చెట్టును పాతిపెట్టడం పూర్తిజేసేడు. యింతలో నారాయణి స్నానమాచరించి నదీతీరమునుండి వస్తు

యుంది. ఇంతసేపు — దాలినిప్పులా కుమిలిపోతూవున్న దిగంబరి ఎందుకంటె సర్వజనోపయోగకరమైన పనిప్రారంభించి యించుమించు తన కళ్లయెదుటే పూర్తయింది. ఆమె కూతుర్ని చూడగానే "చూచేవా నారాయణి యిలా కాస్తచూడుతల్లీ? నీ మరిది మహాశయుడు జేస్ని యీ ఘనకార్యాన్ని చూడమ్మా! నడిమివాకిట రావిచెట్టుపాతితే నీడ నిస్తుందట చూడు. అటుకూడా ఒక్కసారి పరిశీలించుతల్లీ? ఆ చవట బోలాయ్ చేస్తున్నా ఆ పనిని? చుట్టూ దడి కట్టుటకని - ఆ యెదుపుడొంక అంతాకొట్టి తెస్తు యున్నాడు" అంది.

నారాయణి అటుతిర్గి జూచేసరికి బోలాయ్ ఒకపెద్దఎదురు కంచె మోసుకువస్తుయున్నాడు. తిన్నగావాడు నడివాకిల్లోకి తెచ్చి పడవేసేడు. బోలాయ్కూడా రామ్‌బాబు వయస్సువాడే. నారాయణి యిదంతా జూచి నవ్వడం మొదలెట్టింది. అటు తల్లి మహాక్రోదాన జ్వాలలు వెడలగ్రక్కుతూ వుండుట; ఇటు రామ్‌బాబు అమాయకత్వం ఇదంతా జూస్తువుంటే ఆమెకు చాలా వినొదంగా కన్పించింది. "నడింవాకిల్లో రావిచెట్టువేసిన యేమౌతుందిరామ్?" అంది.

రామ్‌బాబు "యేమౌతుందేంటి వదినా? తమాషాగా ఎంత చల్లటి నీడనిస్తుందో తెలుసానీకు యీ చిన్న కొమ్మలు జూచెవు? అవి పెద్దవయ్యేక మా గోవింద్‌కు వుయ్యాలవేస్తాను. ఆ గోవింద్ వ్రేళ్లితో జూపకరా - దడియింకాయెత్తు వుండాలిరా బోలా! లేకపోతే మన ఆవు మెడజాచి ఒక్కతూరి గబలిస్తాదిరా గొడ్డలి యీలా యివ్వరా నీకు చేతగాదు." అని వానిపద్ద గొడ్డలి తీసుకొని చరాచరా నరుకుతున్నాడు.

నారాయణి చిరునవ్వు నవ్వుకొంటూ బిందె వంటయింటిలో దింపి రావడానికని లోనికెళ్లింది.

కోపముతో దిగంబరి కళ్లు చింతనిప్పులలా పెట్టుకొని కూతురువైపు తీక్షణంగా జూస్తు "నీవు పల్లెత్తుమాట అన్నైన అనవేమి? అయితే యింటిక్కడ రావిచెట్టు పెరగవలసిందేనా?" అంది.

నారాయణి చిరునవ్వు నవ్వుతూ "అమ్మా! యెందుకు నీవంత కంగారు పడుతావ్? దానికి పేచు-నారూపుందా? కాసిని నీరు పోసినంతమాత్రానే? అది బ్రతికి పెరుగుతుందా? రేపు తెల్లండి ఆ కొమ్మ ఎండిపోక యేమౌతుంది. యీ పాటిదానికి యింత గుండాపిండైపోతావేమమ్మా!" అంది.

దిగంబరి ఆ శాంతవచనాలకు యేమాత్రం తలవొగ్గక - "అది ఎండిపోతుందో మండిపోతుందో! యేమో నే నీ మంచి కోరేదానినే అయితే అది నా యెదుట పీకిపారవెయ్యి" అంది.

నారాయణి తలఆడిస్తు - "ఉహూం. అలా జర్గదు - దాటోయ్ పీకిపారెయ్యడమే. అయితే యీ యింట యెవ్వరికి బ్రతికే ఎత్తుండదు."

"ఏం? బుద్ధిపుట్టినంతనే రావిచెట్టుతెచ్చి యింటిలో పాతి పెట్టడానికి అతనికి హక్కువుందా యేం? అందులో మీరు మాత్రంలేదా? యీ యిల్లుఅంతా ఒక్కడదేగాదు మా గోవిందుకు కూడా సగంహక్కువుంది. తెలుసునానీకు? రావిచెట్టుపైకి కాకులు, గెద్దలువచ్చి ఎముకలు బొమికలు ఇళ్లంతా వదేస్తాయి. గబ్బిలాలు-

కాపురముంటాయి. ఇలా అయితే నేనీ యింటిలో క్షణం అయినమా మసలలేను నారాయణీ? అతడంటే మీ కందరికీ యింత హడల్ యేమిటో ముందుచెప్పమ్మా! యిదే మా యింట్లోనే అయివుంటే - యితని పెంకితనము కోతిచేష్టలు ఒక్కనిముషములో పటాపంచాలు జేసివేసేదాన్ని వీడి ముఖంమండా?" అంది.

నారాయణి నిశ్చలంగా తల్లి హృదయాన్ని యీనాడు అద్దములో జూచినట్లు స్పష్టముగా చూడగల్గింది. ఒక్కనిముషము అలానే జూస్తు పూరుకొని పకాలుననవ్వి "చిన్నపిల్లవాడు! అతనికి అప్పుడే బుద్ధి ఎక్కడనుండి వొస్తుంది. బుద్ధి తెలిసినవాడైతే యెవ్వరైనా నడింవాకిట్లో రావిచెట్టు తెచ్చి పాతిపెడ్తారా? రెండుదినాలు పోనీ తనంతట తనే పీకిపారవేస్తాడు". అని అంది.

"ఆఁ ఆగతాయి స్వయంగా పీకిపారేస్తాడా అతనెందుకు పారేస్తాడు ఆ పనేదో నేనే జేస్తాను. అతడేమిజేస్తాడో చూస్తాగా" అంది దిగంబరి.

"వద్దమ్మా! వద్దు. ఆ పని నీవుచెయ్యక నే చెప్పుతున్నాను విను నీ కతడి సంగతి తెలియదు. నే తప్ప అన్నగారైనా చెయ్యిజేసుకోడానికి సాహశించరు. నీ కెందుకు అంతతొందర యీ వేళ పోనీ" అంది నారాయణి.

దిగంబరి విసుక్కొంటూ - "సరేలే, సరేలే - నీవుపో. తడిబట్టలతో యెంతసేపని వుంటావు నీవువెళ్లి పొడిబట్టలు కట్టుకోపో లోనికంది" ఆ పూట గతించింది.

మధ్యాహ్నం నారాయణి తనగదిలో తలగడ గలీబులకు-పూలుదారముతో పూలు కుట్టుకొంటుంది. నృత్యకాళీ నడివాకిట గుండా వొస్తూ అక్కడ రావిచెట్టు లేకపోవడముజూచి ఆతురుతగా లోనికి పరుగెత్తుకొచ్చి " అమ్మా ! యింకేముందమ్మా ! నాశనం నాశనం జేసేరమ్మ ! అమ్మమ్మగారు. రామ్‌బాబుగారు పాతిన రావిచెట్టు పీకిపారేసేరమ్మ ఆయన స్కూల్‌నుండివచ్చి జూసేరా " ఇంకెవర్ని బ్రతకనీయరు " అంది. నారాయణి చేతిలోపని ఓమూలపడవైచి పరుగెత్తుకు నడిమివాకిటకొచ్చి జూస్తే చెట్టు లేదు.

" రామ్‌బాబు చెట్టుయేమైందమ్మా ? " అని దిగంబరిని జూచి అడిగింది.

దిగంబరి చేటంత మొఖంజేసుకొని " అదిగో ఆ పాడు ముండాచెట్టు " అంది.

నారాయణి దగ్గరకు వెళ్లిచూచేంది. చిన్నచిన్న ముక్కలుగా విరిసి పోగుజేసి పెట్టింది. చటన అవిఅన్నితీసి బైటపార వేసి నెమ్మదిగా తనగదిలోనికి వెళ్ళిపోయింది.

రామ్‌బాబు స్కూల్ వదిలిపెట్టగా నిన్నతను పాతిపెట్టిన చెట్టును జూచుకొందామని వచ్చేడక్కడకు తీరాచూస్తే చెట్టుకన్పడ లేదు. వెంటనే చేతిలో పలకాపుస్తకాలు గిరాటువేసి పరవల్లు తొక్కుతూ " ఓ వదినా ! నా చెట్టుఎక్కడా అని కేకలేయ దొడగేడు.

నారాయణి ఆ కేకలధ్వని ఆలకించి బయటకువచ్చి " చెబుతా నీవు యిలారా " అంది.

రామ్‌బాబు కేకలు పెట్టుచు దగ్గిరకురాగానే చెయ్యిపట్టుకొని తనగదిలోనికి తీసుకుపోయి వాడిలో కూర్చుండబెట్టుకొని నుదురు — ముంగురులు సిమురుతూ "మంగళవారపు — పూట యింటిలో రావిచెట్టు ఎక్కడైనా యెవ్వరైనా పాతుతారాబాబు!" అంది.

రామ్‌బాబు వెలవెలబోయి "పాతుతే యేమౌతుంది" అని అడిగేడు.

నారాయణి నవ్వుతూ అలా పాతుతే ఆ యింటిపెద్దకోడలు చచ్చిపోతుంది నాయనా!" అంది.

రామ్‌బాబు ముఖం ఒకగడియ వాడిపోయింది "ఆఁ ఇవన్ని అబద్ధాలు నీవు నవ్వుతున్నావు ఊఁ నేనమ్మను" అన్నాడు.

"లేదుబాబు! అబద్ధాలుకాదు, యిట్లాటివన్ని పంచాంగము లలో వ్రాసియున్నాయి" అంది నారాయణి చిరునవ్వుతో.

రామ్ అన్నాడు "యేదీ పంచాంగముజూద్దాం"

నారాయణి లోలోన యిదొకచిక్కు కొనితెచ్చుకొన్నానే అనుకొంటూ - ఆశ్చర్యముతో "నీవెక్కడ పిల్లాడివోయ్ - యేదీ తెలియదునీకు మంగళవారంపూట పంచాంగంజూస్తారా యెవ్వ రైనా? తప్పుకాదు" అంది.

తన వొదినగారి మాటలయందు నమ్మకముకుదిరి హఠాత్తుగా తన మాతృసమానురాలైన వదినగారి మెడకు తన రెండుచేతులు పెనవైచి వక్షస్థలమున తలదాచుకొని "వదినా! అదితీసిపారేస్తే యికదోషం వుండదుకదా" అన్నాడు.

నారాయణి తనమరదితల అలానేగుండెకదుముకొని "అహాః యేదోషముండదు నాయనా !" అంది. ఆమెకళ్లు నీళ్లతోనిండేయి మృదుస్వరము తో " బాబూ నే చచ్చిపోతాననుకో నీ పేమిజేస్తావు!"

రామ్ " ఛా ఇంట్లాంటి మాటలనకూడదు నే వినకూడ " దన్నాడు. నారాయణి కళ్లనీళ్లు తన పైటచెంగుతో చాటుగా తుడుచు కొని ' నే ముసలిదాసినై నానుకలా ఇంకచావక వుంటానా యేమి ' టంది. ఈ మాట రామ్‌బాబు ఇది పరిహాసకమని తెలుసుకొని తలపైకెత్తి " వహ్వా వహ్వా మా వదిన ముసలిదట. ఒక్కపన్ను అయినా వూడలేదు. పైగా తల వెంట్రుకల నెరవలేదు. అప్పుడే ముసలిదైనదటా; ఛా వూరుకో యెవ్వరైనా వింటే నవ్విపోతారు "

" తలవెంట్రుకలు నెరవకపోయినా నేను ఎప్పుడో ఒక నాడు నదిలోపడి చచ్చిపోతాను స్నానానికి వెళ్లి మళ్లాయింటికి రానేరాను. " అంది.

" ఎందుకు అలా అంటావు వదినా ? "

" నీవు పెట్టే యమయాతన మూలంగానే నీవు మా అమ్మను జూచి ఓర్వలేకుండావున్నావు. నేను అలా తిరిగిరానిరోజున నీకు తెలిసివొస్తుంది. అంతవరక్కు నీకు అర్థంగాదు " అంది.

ఈ మాటలపై రామ్‌బాబుకు నమ్మకంచిక్కలేదు గాని. మనస్సులో యేదోవొకవిధమైన జాలికల్గి శంకించి " సర్లే యిక నే మాట్లాడను కాని, ఆమె రోజూ నన్నుజూచేసరికి అలాతిడు తుందేం ! "

" తిడుతే ఏం, మునిగిపోయింది. ఆమెనాకు తల్లిగాబట్టి నీకుగూడా అంతే నీవు నన్నెలజూస్తావో అలానే ఆమెను జూడాలి.

రామ్‌బాబు ఆ మాటవిన్నాక తనమొఖం ఆమెవక్షిన దాచు కున్నాడు. అలా అక్కడ తలదాచుకొనే పదమూడు వసంతాలు పెరుగుతూ వచ్చాడు. ఇంత పెద్ద అబద్ధాం యేలా ఆడగలడు. అలాంటివాడు ? ఇది అతగానికి కేవలం అసాధ్యవిషయం కూడాను.

నారాయణి మృదుకంఠంతో "అలా మొఖం దాచుకుంటే యేమైనట్టు ? బాబూచెప్పు" అంది.

అదేసమయములో దిగంబరి అక్కడకు దిగబడినది. ఆమె కంఠస్వరములో మాధుర్యాన్ని వెదజల్లుతూ నీకేం పనిపాటు లేదా నారాణీ ! పిచ్చిదానిలా మరిదిని వొళ్లో కూర్చోపెట్టుకొని గారాభము వొలకబోస్తువుంటే సరిపోయిందా. ఆవల నీ కొడు కేమైపోతాడో కొంచెం నిధానించి చూడమ్మా ? నారాణీ " అంది.

రామ్ చటస ముఖమెత్తిజూచేడు. అతనికండ్లు రెండూ ఆకలితోవున్న పెద్దపులికళ్లలా చలించి పోతున్నాయి.

నారాయణి రామ్‌బాబుమొఖం గట్టిగా గుండెలకానించు కొని "యేమైపోతూవున్నా దేంటి ? నా పిల్లవాడు ఎందు చేత ?"

"ఎందుచేతా సరే ; సరే, తెలుస్తాదిలే" అంటూ దిగం బరి వెళ్లిపోయింది.

కల్పనాశక్తి సన్నగిల్లిపోయింది. ఆ సమయములో పాపము దిగంబరికి అబద్ధాలైనా చెప్పలేక తలత్రిప్పుకొంటూ వెళ్లింది. రామ్‌బాబు తలతిప్పుతూ ఓ వదినా సెలవియ్యి నేనొక్క నిమషానికిపోయి ఆ కొరివిదెయ్యాన్ని పీకపిసికిపారేస్తా" అన్నాడు.

నారాయణి రామ్‌బాబు నోరునొక్కుతూ "ఛా, అలా అన కోక రామ్‌బాబు ఆమె అమ్మలాంటిదిగా! యెవ్వరైనా విన్నా రంటే యేమంటారు తప్పుగా యిందాకనేగా చెప్పేను నీకు యింత లోనే మరిచిపోయేవా?" అంది.

ఓ వారంరోజులు అయినపిమ్మట నారాయణి నదికివెళ్లి స్నానంజేసుకువొచ్చి పూజాగృహములో పూజ జేసుకొంటూవుంది. రామ్ భోజనముకు వచ్చేడు. అక్కడ దిగంబరివుంది "రా అన్నంపెట్టుతా" నంటు రామ్‌కు భోజనముపెట్టి పక్కకుపోయి నిలబడింది. రామ్‌బాబు అన్నంతినుట ప్రారంభించి "అచ్ఛా అంటూ రెండుసార్లు మంచినీళ్లుత్రాగి ఛా ఛా కారం నోరుమండి పోతుంది. అంటూ లేచిపోయి పెద్దకేకలేచుకుంటూ చిందులు తొక్కుతూ ఆ ముసలివరడ వండినఅన్నం నే తినలేను. కారంతో నోరుమండిపోతుంది వదినా - ఓ వదినోయ్" అనటం మొదల పెట్టేడు.

ఆ కేకలువిని పూజాగృహంవదిలి పరుగెత్తుకొొచ్చి "యేం, యేంజర్గింది. రామ్‌బాబూ! అంది నారాయణి.

రామ్‌బాబు ఏడ్చుచు నే నెప్పుడూతినను. బాబోయ్. కూరలో కారంముద్ద వేసేసింది ముసలిరాక్షసి ఆమెను వెళ్లగొట్టాలే మార్గము వదినా?" అంటూ తుఫాన్‌గాలిలా యింటిలోనుంచి బైటకు వెళ్లిపోయినాడు.

నారాయణి వెలవెలబోతూ కొంచేపు అట్లానిలిచి "అమ్మా! కూరల్లో యింతచేటు కారం పడబోయకని యెన్నిసార్లు చెప్ప

నమ్మా ? ఇంతకారము పడబోసేసినట మా యింటిలో యెవరికి అలవాటు లేదు " అంది.

దిగంబరి చటమని ఈసడించుకొంటూ " కారమెక్కడ వేసేనే, రెండుమూడు మిరపకాయలు తుంచివేసేనోలేదో యీ పాటి దానికే యింత అల్లరిపెట్టి అగచాట్లుపాలు చెయ్యాలా ? " అంది.

నారాయణి ఆ మాటలకు చీకాకుతెచ్చుకొంటూ " ఆ రెండు మూడు మిరపకాయలు వెయ్యకపోతేనేం మాయింటిలో యెవ్వరూ తిననప్పుడు " అంది.

" చాలు, చాలు నారాణి కట్టిపెట్టు నీ పీనాడు నాకు వంట నేర్పనక్కరలేదు. నేను చాలావంటలు నేర్చినదాననే తలనెరిసి ముసలిదానినైన నాకు యీ రోజు నా కూతురుదగ్గిర వంటనేర్చు కొనే కర్మం యేం పట్టలేదులే నా తల్లీ ! " అంది.

నారాయణి మరియేమి మారుపలకక వంటగదిలోనికిపోయి వంటప్రయత్నం జేసుకుంటూ వుంది.

దిగంబరి అక్కడనే చతికలపడి కాళ్లురెండూ చారచాచు కొని నెత్తికొట్టుకొంటూ ఏడుస్తూ " అయ్యో, నా అన్నయ్యా నన్ను కూడా తీసుకెళ్ల లేకపోయేవా అన్నయ్యా. నేనికతాళలేను-బాబోయ్ నోటికెంతపడితే అంత తిట్లుతిడ్తువున్నారు. నే ముసలి వరదనట. రాక్షసినట నన్నిక్కడనుండి తరిమేయాలట ! నేను యీలాటి కూతురు, అల్లుడు యింటికి తిండికి గతిలేకవచ్చేనా యేం ? నాకి క్కడ ఉరిపోసుకు చద్దామన్నా మూరెడు తాడుకూడా దొరకదు కదా ! యింతకంటె వీధివీధినా ముష్టి అడుక్కోవడం మెఱుగ్గుదెల్లి

మంచిది." చిన్నకూతుర్నిజూచి "రా అమ్మా మనమెళ్లిపోదాం, యీ యింటిలో యిక గుక్కెడు నీళ్లయిన తాగవొద్దురా," అంటూ పెద్దపెట్టున రాగాలుతీయుట ప్రారంభించింది.

సురస ఏడుస్తు తల్లిదగ్గరకొచ్చి నిలబడింది. దిగంబరిలేచి ఆ పిల్లచెయ్యపట్టుకు పదపోదాం శనివిరగడైపోతాది. అంటూ వెళ్లటకు సిద్ధపడుతుంది,

నారాయణి వంటగదిలో కూరగాయలు తరుగుచు అంతా వింటునేవుంది. తల్లి ప్రయాణంజూచి లేచివచ్చి అడ్డంగా నిలబడ్డది.

దిగంబరి యేడ్పు యింకొంచెము హెచ్చున ప్రారంభించి "వద్దు నన్నాపవద్దమ్మా నారాణీ: పోనీమమ్మలను మేము తిండి తిప్పలులేక కుష్కించి యేచెట్టునీడనో మేసువాల్చితే మంచిది గాని యిక యీ యింట అన్నంతిని మీ యింటమేము మకాం వేయలేముతల్లీ" చాలు యింతవర్కు అయిన యీ వెర్రిమొర్రి వేషాలు. యికచాలులే" అంది.

నారాయణి కరములుజోడించి, "యెవ్వరిపై అలిగివెళ్లిపోతూవున్నావమ్మా? మేము నీకు జేసినలోటుయేమిటి ఘోరాపరాధ మేముంది" అంది.

దిగంబరి యీ మాటు ఏడ్పుస్తాయి. మరోమెట్టెక్కించి "నే నేం పసిపిల్లననుకొన్నావా నారాణీ? నాకన్నివిషయాలు తెలుసు. ఆవలించిన పేగులులెక్కెట్టేదానినే అట్టి నాకన్నులేమాయాలనుకున్నారా? మీరు వెనుక దన్నులేకుండానే వాడు నన్ను సాహసించి అంతలేసి మాటలనగలడా? నేను రాక్షసినా మమ్మల

నింటిలోనుండి వెళ్లగొట్టమంటావా సరే అలాఅయితే వెళ్లిపోతూ వున్నాంలే తల్లీ ! మేము మీకు నానాయిబ్బందులలో పడవేసే రకాలము ! దారియికవిడిసిపెట్టు చెప్పుతున్నాగా ! " అంది.

నారాయణితల్లి పాదములపైబడి " క్షమించుతల్లీ ! పోనీ వారిని యింటికిరానీ ఆ తరువాత నీ యిష్టముంటే వుందువుగాని లేకపోతే వెళ్లుదువుగాని అని ఆమెను బలవంతముగా చేతులు పట్టుకు తీసుకువెళ్లి కాళ్లుకడిగి గుడ్డనద్ది పీటపై నాసీనురాలుగా జేసి విసనకర్రతో విసరటం మొదలెట్టింది. అప్పటికి దిగంబరి కోపం శాంతించి నట్లయింది కానీ, హృదయములో జ్వాల ఎలుగుతూనేవుంది.

మధ్యాహ్నం కచ్చేరిపని ముగించుకు శ్యామలాల్ యింటికి వచ్చి విస్తరముందు కూర్చునేసరికి దిగంబరి తలుపుచాటున కూర్చుని ఏడ్వడము మొదలెట్టింది. శ్యామలాల్ వెలవెలబోతూ ఆ దిక్కుజూస్తువున్నాడు. క్షణంలో విషయాన్నంత గ్రహించుకొని సఖం తింటూతింటువున్న అన్నం వదిలి చేతులుకడుక్కొని లేచి వెళ్లిపోయేడు. ఈ కోపంయెవ్వరిమీదనో నారాయణి ఆకలింపు జేసు[illegible] నేత్రాన్ని జూస్తువున్న నృత్యకాళి సహించలేకపోయింది " అమ్మమ్మగారు. మీకన్నీ తెలిసివుండికూడా ! యిలా చేయాలనే తలంపుతోనే పెద్దబాబుగార్ని అన్నం తిననీయకుండా జేసేరా ! యిదేనామర్యాదా ? కంటతడిఅయిన ఆరలేదు. మా అమ్మగారే లేకపోయినట్లయిన యింతకుముందే బైటికి బాబుగార్ని వెళ్లగొట్టి వుండేవారు ! " అంది.

దిగంబరి నోటమాటరాక మూతిముడుచుకొని కూర్చుంది.

ఒకగంటపోయేక రామ్‌బాబు అక్కడక్కడతిర్గి యింటికి వచ్చేడు. ఆ గదీ యీ గదీ పెరడులోనూ వెదికివెదికి చివరకు వదిన గదిలోనికివచ్చి జూచేడు. వదిన గోవిందుని పక్కనేసుకు పడుకొనివుండుట జూచేడు. రామ్‌బాబుకాదృశ్యం అంతబావుండ లేదు. నెమ్మదిగా "నాకు ఆకలిగావుంది వదినా" అన్నాడు.

వదిన యేమీమాటాడక అట్లాగేవుంది.

"నన్నేం తినమంటావ్," అన్నాడు గట్టిగా.

ఆమె అలానేపడుకొనివుండే 'నాకేంతెలియదు నీవిక్కడ నుండి ఫో, అవతలకు' అంది.

"ఉహుం, నే నవతలకు వెళ్లను. నాకేం ఆకలివేయటం లేదనుకుంటున్నావా యేం?" అన్నాడు

నారాయణి పత్తిగిలి పడుకొంటూ కొంచం విసుపుతో "నన్నట్టే బాధించకు రామ్! నీకంత ఆకలిగావుంటే! నృత్యకాళివుందిగా! వెళ్లిదాన్నడుగు పెట్టుతుంది" అంది.

రామ్‌బాబు క్షణంమాటాడక వూరుకొని నెమ్మదిగా యివతలకువచ్చి, నృత్యకాళివద్దకువెల్లి "తినటానికేదైనాపెట్టవే నృత్తి!" అన్నాడు.

నృత్తికాళిసిద్ధముగావున్నదానిలా లోనికివెళ్లి ఒకగ్లాసుతో పాలును, ఒక గుప్పెడు వేపుడుబియ్యం కొన్ని కొబ్బరిముక్కలు తెచ్చి యిచ్చింది.

రామ్‌బాబు యివిజూచి కోపంతో "యిదేనాయేం?" అన్నాడు.

చిన్నబాబూ! నీవు తిన్నగావుండదలచుకుంటే గప్‌చుప్‌గా యీవేళకు యివితిని వూరుకుండండి అట్టే-అట్టహాసం చ్యేయకండి పెద్దబాబుగారు అన్నంతినకుండా కచ్చేరికివెళ్ళిపోయేరు. అమ్మ ఉపవాసముజేస్తూ గోవిందుని పక్కనేసుకొని పడుకొనివున్నారు. మీరేమాత్రం అల్లరిజేసిననూ వారులేచివచ్చేరా యీవేళ మీ మాటదక్కదు. నే ముందుగానే చెప్పుతున్నాను వినండి!" అంది నృత్తికాళి.

రామ్‌బాబు పరిస్థితులన్ని కనిపెట్టేవున్నాడు గాన అట్టే హంగామాచేయక పాలుతాగి తక్కినవన్ని జేబులోవేసుకునితిన్నిగా చెరువుగట్టువైపువెళ్ళి అక్కడోపెద్ద మర్రివృక్షంక్రింద వెళ్ళి కూర్చున్నాడు వానికేమి తినబుద్ధిపుట్టలేదు. వదిన భోజనము చేయక పడుకొంది. అతను పరధ్యానముగా బియ్యంగింజలు నోటిలో ఒక్కొక్కటి వేసుకొంటూ ఆలోచనాసముద్రంలో పడ్డాడు తనకు యేదైనా మంత్రంవొచ్చివుంటే బావుండును. మునీశ్వరులులా ఇక్కడిలావుండే వదినకు కడుపునిండేటట్లు చేయవచ్చుకదా! అలాంటిమంత్రాలు యేవిరావు యిక మరొపద్ధతేముంది జేయడానికి అంటూ యెంత ఆలోచించినా వానికేమి బోదపడలేదు. ఒక నిశ్చయానికి రాలేకపొయ్యేడు. తిన్నగా వదినవద్దకువెళ్ళి భోజనం చెయ్యమని బ్రతిమాలాలనుకున్నాడు గాని, సిగ్గువెనుకకు నెట్టుతుంది. కాగా అన్నకూడాతినలేదుగా! యిక వదినేమని తింటుంది. జేబులోపోసిన వేపుడుబియ్యం కొబ్బరిముక్కలు చేరువులో చాపలకు గిరాటువేసి లేచి మతిపోయినవాడిలా వూరంతాతిరగడ

ప్రారంభించేడు. వదినే అన్నంతినకుండా పడుకుందే అన్నవిష యమే అతనికి మాటిమాటికి మనస్సున అందోళన పర్చుతుండేది. ఆ సంగతి జ్ఞప్తికివచ్చినతోడనే తన గుండెపైసమ్మెట గొట్టి నట్లుండేది.

ఆ రాత్రి. శ్యామ్‌లాల్ భార్యతో "ఇకనేనతనిబాధలు సహించలేను. వాణ్ణి యీ యింటనుంచుకొని కాలముగడుపుట చాలాకష్టము గాన, అతడు యింటవుండడం అంటూ వీలులేదు." అన్నాడు.

నారాయణి నిచ్చేష్టురాలై "యెవ్వరిసంగతి మీ రనేది?" అంది.

"రామ్ సంగతే! మీ అమ్మగారు వారమురోజులనుండి ప్రతిదినము చెప్పతూనేయున్నారు. రామ్ వార్ని వృథాగా తిట్టుచున్నా డట. అదియేమంతా బావుండలేదు. నేనుయింటికి వచ్చేటప్పటికి ఆమె దుఃఖంతో చెప్పతూవున్న మాటలువింటూవుంటే నా హృద యం దహిస్తుంది. యీ వూరిలోగల పంచాయితీదారుల రప్పించి వారియెదుట వాడిఆస్తిపాస్తుల్లో వానిభాగము వానికిపంచి యిచ్చే స్తుయున్నాను. వాడిక వేరేవుండవచ్చు యిక్కడవుండడానికి అవ కాశములేదు. నే నింక వూరుకొనలేను" అన్నాడు.

నారాయణి ఆ మాటలన్నివిని తెల్లబోతూ 'రామ్‌బాబుని వేరేయుండేటట్లుజేస్తారా! అటువంటిమాటలెప్పుడు హృదయము లోనికి జోరెనీయకండి, అతను పాలుతాగేపిల్లాడు, యీ ఆస్తి పాస్తులు తీసుకొని అతడేంచేస్తాడు. చెప్పండి? యీ చిన్నతన ములో" అంది.

శ్యామ్‌లాల్ వ్యంగంగా " అప్పుడు పాలుతాగేపిల్లాడే ఆస్తి పాస్తులు యేమిజేసుకోవాలో అదివానికేతెలుసు" అన్నాడు.

" అతనికేమి తెలియదని నాకూ తెలుసు అయితే - మా అమ్మ యీ వారంరోజులనుండి మీకీ సంగతులు చెప్తూతూ వస్తుం దనుకుంటాను. ఏం!" శ్యామ్‌లాల్ కొంచెం వెనుకముందు తట పటాయిస్తు " ఉహుఁ ఆమె యేమీచెప్పలేదు. కానీ యీ ప్రజానీ కానికి కష్టలేవూ! నే నీపాటి యూహించ లేననుకుంటున్నావా నీవు! అన్నాడు.

" లేదు నే నలా అనుకోలేదు. అతనిని వేరుందమంటే ఒక్కటాలోసించనక్కరలేదా! అతనికి యెవరున్నారు. యెవర్ని తీసుకువెళ్లి వేసుంటాడు! తనకుపిల్లివుందా! లేక అక్కచెల్లిలు వున్నారా! పోనీయండీ మేనత్తగాని పినతల్లిగాని వున్నారా? అత గానికి! యెవ్వరు వండి పెట్టుతారు ఇవిఅన్నీ యేమైన ఆలో సించారా మీరు?" అంది.

శ్యామ్‌లాల్ అయిష్టముగా తలనాడిస్తు "అవిఅన్నీ నాకక్క రలేదన్నాడు, అన్నాడేగాని యెవ్వరూలేరని అతనికితెలుసు యింత పెద్ద యదార్థవిషయాన్ని అతనికి తెలియకుండావుండే విధానంఏదీ?

నారాయణి ఏదోఅనబోయింది. గాని పెదిమలు వణికేయ అందుచే ఆమెక్షణంవూరుకొని తోట్రుపాటువిడచి ప్రశాంత వాతావరణంకు వచ్చి గంభీరముగా భర్తవైపు జూస్తూ—

" వినండి, బొమ్మలతో ఆడుకొంటూ చిత్రవిచిత్రమైన గాథలు చెప్పుకొంటూ ఆనందముగా తోడిబాలికలతో కలుకుతూ గెంతులువేస్తూ సరదాగాయుండేవయస్సు — అప్పుడు నాకు పద

మూడు వసంతాలు గడసినావి - మీ అమ్మగారు వచ్చి నా ఆట పాటలు ఆవలద్రోసి నన్నురమ్మని ఆజ్ఞాపించేరు. ఆ పూజ్యనీయు రాలు ఆజ్ఞకు బద్ధురాలనై వారివెంటవచ్చి యీ గృహములో ప్రవే శించేను. ఆ పదమూడేళ్ల వయస్సులో - మీ అమ్మగారు యీ సం సారానంతా నామీదవదలి ప్రశాంతముగా పరలోకానికివెళ్లేరు - అప్పటినుండి నేటివరకు యీ సంసారబారమంతా నే మోయగలు గుతు వున్నానో లేదో వారు జూస్తూనేవున్నారు. నలుగురుకు ఇంత వండేను. పెట్టేను. మీ సేవజేసేను. పిల్లలకన్నాను. పెంచేను. పెద్ద వాళ్లని జేస్తుయున్నాను. యీ కుటుంబమర్యాదలను కాపాడుతూ యీ సంసారవ్యవహార బాధ్యతలన్ని నేనొకత్తెను జేసుకుంటూ వచ్చి చిక్కినగమై యీ యిరువది ఆరు వసంతాలు నిండకుండానే వృద్ధాప్యము పైబడ్డదానిలా అయిపోయెను.కళ్లనీళ్లు తుడుచుకొంటూ చూడండీ యిప్పుడు మీరు యీ సంసారములో సౌఖ్యం కల్గజేసు కోవాలిఅంటే నన్నుమీరు పూర్తిగా మరచిపోండి లేదంటారా! నదిలోపడి నా జీవితయాత్ర చాలిస్తాను. మీరు మరొకన్యను వివాహ మాడి అప్పుడు రామ్‌బాబుకు వేరొకకాపురం పెట్టించండి అప్పుడిక నే నడ్డుపెట్టేటందుకురాను. అప్పుడు నే జూచేటందుకురాను తీర్చి చెప్పేటందుకురాను కాని, యిప్పుడుమాత్రం అలా జర్గేటందుకు వీలులేదు." అంది

శ్యామ్‌లాల్‌కు బార్యఅంటే కొంచంబీతివుంది. అంతా నిశ్శబ్దముగా విన్నాడు. నెమ్మదిగా అక్కడనుండి బైటికివెళ్లినాడు. యిక ఆ రాత్రి ఆ ప్రసంగము అంతతో ఆగిపోయింది.

మర్నాడు నారాయణి రామ్‌బాబుని దగ్గర కూర్చుండబెట్టు కొని వాత్సల్యపూరిత హృదయముతో, తలనిమురుతూ "బాబూ!

యీ వేళనుండి నీవిక్కడవుండవలసిన అవసరములేదు! నీవూ వేరే యెక్కడకైనాపోయి వేరే బ్రతుకగలవా?" అంది.

రామ్‌బాబు పకాలుననవ్వి "ఓ వుండగలను వదినా! నీవూ నేను, గోపాల్-బోలా-ఊఁ ఎప్పుడు వెళదాము వదినా!" అన్నాడు.

నారాయణి నిచ్చేష్టురాలైంది, రామ్‌బాబు అంత అమాయకముగా మాట్లాడుతున్నప్పుడు యింకేమంటుంది. రామ్‌బాబు ఆ విషయాన్ని అంతలోవదలలేక ఎంతో ఆనందాతిశయమున "ఎప్పుడు వెడదాంవదినా!" అన్నాడు.

ఆమె ఆ పలుకులకు సమాధానముగా అతనిముఖమును హృదయంమీదకు తీసుకొని "నీవు ఒక్కడవే వెళ్లతావా! మీ వదినను వదిలిపెట్టి వుండలేవుబాబు!" అంది.

"ఉహూఁ నేను వుండలేను వదినా!" అన్నాడు.

"అయితే నే చచ్చిపోతేనో!" అంది.

"ఆఁ, ఛీ. అలా ఒక్కనాటికిగాదు," అన్నాడు.

"ఆఁ తెలుస్తుంది లే మీ వదినమాట ఒక్కటీ విననందుకు"

"నీ మాట నే యెప్పుడు వినలేదు. వదినా!" అన్నాడు.

"యేనాడువిన్నావోచెప్పు! నీకు యెన్నిరోజులనుండీ చెప్పుతువున్నాను, మాయమ్మను తిట్టకయని నిన్నకూడా తిట్టేవు యీ తూరి యిక నా యిష్టంవచ్చిన చోటికి వెళ్లిపోతా!" నంది.

"నేనుకూడావస్తా నీ వెక్కడికివెళ్తే అక్కడకే!"

"నేను ఎక్కడకు వెలుతానో నువ్వు తెలుసుకొనలేవు నే చాటుగా వెళ్లిపోతాను!" అంది నారాయణి.

"మరి గోవిందో?"

"వాడు నా దగ్గరేవుంటాడు. నీవు బరువుబారం మోయాలి"

"ఉహూం నే వాని బరువుబారం మోయలేను వదినా"

నారాయణి చిరునవ్వు నవ్వుకుంటూ "నీవు పెంచాలిరా; నాయనా" అప్పుడిక రామ్‌బాబు ఆ మాటలు యదార్ధంగాదని పక పకా నవ్వి "యివన్ని వట్టిమాటలే మాటలాడుతున్నావు. నీ వెక్కడకువెళ్లివూ" అన్నాడు.

"యివిఅన్ని వట్టి మాటలుకావుబాబు చూడు నేవెళతానో వెళ్ళనో!"

రామ్‌బాబు ఆమాటలకు హృదయాందోళనగల్గి "అయితే ఇకవేళ నేను నీ మాటలన్నీ వింటూవుంటే?" అన్నాడు.

నారాయణి నవ్వుతూ "ఆలాఅయితే నే నెక్కడకువెళ్లను. పైగా గోవిందుని నీవు పెంచనవసరముండదు" అంది.

రామ్‌బాబు సంతోషముతోలేచి గెంతులేచి "అయితే నీవు యీవేళనుండిచూడు" అంటూ పరుగెత్తుకు వెళ్లినాడు బయిటికి.

# మహా డం

రెండు మూడువారాలు ప్రశాంతముగా గడచిపోయేయి దిగంబరి క్రూరవీక్షణాలు ప్రచురించలేదా యంటే తర్చు జేస్తునే యుండేది. కాని, రామ్‌బాబు తప్పుకు తిర్గుతూవుండేవాడు. ఆ వేళ అతని వదినచెప్పిన మాటలు నమ్మకము లేకపోయినప్పటికి తన హృదయములో ఏదో భయం ఆవశించినట్లుంది అతనికి. కాని, భగవంతుని దయ లేకపోవటంచేతనేమో యీ వేళ ఒక అవాంతరము దిగబడింది - యిటీవల దిగంబరి పితృదేవతలు తనువెంటాడి తిరుగుచున్నట్లు ముఖ్యముగా తన తమ్ముని, ఆత్మ తరుచు అల్లునియింటికి వొస్తు - పోతూయున్నట్లు స్వప్నములోనే - అయ్ని వారిని తృప్తిపర్చి పంపుటకు వారిపేరుమీదగా కొంతమంది బ్రాహ్మణులకు తృప్తికరమైన భోజనాలు ఏర్పాటు చేయ నిశ్చయించుకొంది.

ఉదయాన రామ్‌బాబు లెక్కలుచేసుకుంటూ యున్నాడు. యింతలో భోలావచ్చి, "బాగాయ్‌గాడు మీ కార్తీక, గణేశ్‌లను పట్టుకోడానికి పెద్దవల తీసుకొచ్చాడుబాబు అనే కబురు చెవిని వేసేడు.

కార్తీక, గణేశులంటే పాఠకులకు కొంత చెప్పవలసివుంది. చాలా దినాలనుండి రెండు పెద్ద చేపలు విడిపోకుండా ఆ పెద్ద చెరువులో సంచరిస్తూ వుండేయి. రేవులోకూడావచ్చేవి. అవి మనుష్యులకు బెదరక నిర్భయంగా తిరుగుతూ వుండేయి. అవి రాముడు అందరు తోను అనేవాడు "పెంపకము చేపల" ని వాటి జోలికి యేవ్వరూ పోకూడదని వాటికి కార్తీక, గణేశులని నామకరణంజేసి వాటిరూప గుణాదులు అందరుకు వర్ణించి చెప్పుతూ అందరకూ చూపేవాడు. వాటిలోవున్న విశేశం అందులో యేదికార్తికుడో, యేది గణేశుడో యెవ్వరూ నిర్ణయం చేయలేక పోయేవారు. ఒక్క రామ్‌బాబు తప్ప.

నారాయణి నవ్వుతూ "రామ్‌బాబు కార్తీక, గణేశులు నా శ్రాద్దానికి, అందరుకు వండిపెట్టించు" అనేది (పితృకర్మల్లో చేపలను వంగదేశ బ్రాహ్మణులు వండుకొంటారు. నిత్యము బోజనములలో వాడుకుంటారు. వారికి నిశిద్ధంలేదు.)

బోలా చెప్పినకబురు రామ్‌బాబు విని 'సరే వలవేయమను చూద్దాం వేడుక. వలకాస్తా అక్కడ పారవేసి పరుగెత్తవలసినదే" అన్నాడు.

"కాదు రామ్‌బాబుగారు ఆ వల యెక్కడనుండో గట్టిది తీసుకువచ్చేడు. మన చిన్న వల లాంటిదికాదు. అబ్బో దానిని తెంచాలన్నా తెగదు చిన్నబాబు అన్నాడు బోలా.

రామ్‌బాబు చట్‌మని లేచి "పదా జూద్దాం" అన్నాడు రామ్‌బాబు తొందరగా చెరువుదగ్గరకు వచ్చి జూచేసరికి

కార్తీక, గణేశుల పట్టుకొనుటకు వ్యూహం పన్నుతూయున్నారు. బాగాయ్ వాటికి కొంత మేత పారవేసి అవి దగ్గరకురాగానే వల వేద్దామని సిద్ధముగా నిలుచుని వున్నాడు.

రామ్‌బాబు — బాగాయ్‌ని మెడబట్టుకొని తోస్తు "మూర్ఖుడా తిను భండారములు యెరజూపి కార్తీక, గణేశుల పిలుస్తువున్నావా?" అన్నాడు.

వాడు పెద్ద రోదనజేయుచు "పెద్దబాబుగారు పట్టుకరమ్మని సెలవిచ్చేరు బాబు. యెక్కడా చేపలు దొరకలేదని యివే తీసుక రమ్మన్నారట" అన్నాడు.

"ఛా, నోర్ మూయ్" అంటూ ఆ వలను లాగికొని వాడినిపొమ్మని తను తిన్నగావచ్చి లెక్కలు రాసుకొంటూ కూర్చున్నాడు. యెవరిమీద దెబ్బలాట కెళ్లనని మాటయిచ్చిన మూలాంచి.

దిగంబరి యీ వేళ సందే చీకటిలోనే లేచి నదికి స్నానానికిపోయి స్నానం వగైరా పూర్తిజేసుకొని తావళంతిప్పకొంటూ వొకమూల కూర్చుంది.

యింతలో నృత్యకాళివచ్చి "చేపలేవి దొరకలేదమ్మా? పెద్దచెరువులో వల వేయవద్దని చిన్నబాబుగారు బాగాయ్‌ని మెడపట్టుకు త్రోసి పొమ్మన్నారట! అని చెప్పింది. దిగంబరి వాంఛ ఏన్నాళ్లానుండో, కార్తీక, గణేశులపై బడివుంది. అంటే యీమె వుద్దేశం అది తిందామని కాదు. యేలాగో ఓలాగు నా రెండింటినీ తన స్వహస్తాలతో వండి బ్రాహ్మణుల విస్తటిలో వడ్డించి, కీర్తిని, పుణ్యాన్ని సంపాదించాలన్న కోరికను చాలకాలమునుండి

ఆశతో అనుకొంటూవచ్చింది. నిన్న అల్లునితో మనవిజేసి అంటే కార్తీక, గణేశుల విషయం చెప్పలేదు. " యేవో మనచెరువులలో పెద్ద చాపలను తెప్పించి బ్రాహ్మణులకు వొంటజేసి పెట్టనుబాబు" అంది. " సరే అలానే చేయండీ " అన్నాడు ఆయన. యీ అవకాశమును తీసుకొని బాగాయ్‌గాడికి కొంతలంచమిచ్చి పెద్దవల తెప్పించి అన్ని ఏర్పాట్లుజేసి ఆ రెండు పెద్దచేపలు రేవులో తిరుగుతూవుండగా ఒతూరిజూచి బాగాయ్ గానితో బేగి తెమ్మని తను యేమి యెరుగనిదానిలా జపములో కూర్చుంది. యిట్టి సమయములో బాగాయ్ కార్యక్రమానికి రామ్‌బాబు అడ్డుపడడం యీలా తను కార్యక్రమం భగ్నం అవుతుందనుకోలేదు. ఆమెకు యిదో దుర్వార్తలా చెవికి సోకింది. సోకగానే యిదిమంచి — యిదిచెడు. అనే జ్ఞానము నశించింది. ఆమెకు పళ్ల పటపటలాడించే స్వభావంకూడా వుందిలెండీ! ఆమె చట్‌న పళ్లకొరుకుతూ జపమాల పైకెత్తిపట్టుకొని " ఎలాంటి పరమశత్రువు దాపురించేడో! ఆ పరమపాతకుడు ఎప్పుడు చస్తాడో ఆనాడుకాని నా ప్రాణాలు నిశ్చింతగావుండవు. వో భగవంతుడా! నీవు నిజమైన వాడవైతే మూడురాత్రులు గతించకుండా, పోయేటట్లు చేయాలితండ్రి " అన్నది.

నారాయణీ ఆ ప్రాంతాన్నే కూరలు తరుగుతు కూర్చొని యివిఅన్నిమాటలువింటూ, ఆమె మెరుపుతీవెలా చట్‌నలేచి " అమ్మా!" అని బిగ్గరగా కేకపెట్టింది. పిల్లలు తమతమ మాతృదేవతలను పిలిచే పిలుపుతో సరితూగగలదీ ప్రపంచానలేదని వినికిడి. నారాయణి నోట ఇప్పుడువెలువడ్డా సంబోధనకూడా సాటి

అయినది. యింకొకటి లేదనుకొంటాను. 'అమ్మా' యనే వాక్కుతో దిగంబరి హృదయం చల్లబడిపోయింది. నారాయణి కూడా యిక యేమి మాట్లాడ లేకపోయింది. అలాజూస్తూ వుండ గానే ఆమె నేత్రాలనుండి కన్నీళ్లు జలజలరాలేయి. ఒక్కనిమిష మ్మాత్రే వుండి పైటచెంగుతో కన్నులు తుడుచుకొని రామ్‌బాబు లెక్కలేసుకొనుచోటికివచ్చి అతనినిజూచి—

"రామ్ నువ్వు బాగాయ్‌ని కొట్టి వలతీసుకొని పొమ్మన్న వటగా?" అంది కోపముగా.

రామ్‌బాబు తుళ్లిపడి తలపైకెత్తి ఒకక్షణంపాటు వదిన గారివైపుజూచి సమాధానం చెప్పడానికి ప్రయత్నం జేయకుండానే దొడ్డిలోనున్న గుమ్మంగుండాచరచరా పరుగెత్తుకు బైటికి పారి పోయేడు.

నారాయణికి అసలు యీ సంగతి యేమిటోతెలియక తల్లి వున్నచోటికివచ్చి నిలబడి బాగాయ్‌ని కేకవేసి రప్పించి "నీవు పోయి చేపలు పట్టుకురా" అని ఆజ్ఞాపించి పంపించింది.

వాడు ఆమె ఆజ్ఞనందుకొని గబగబాపోయి ఒకచేపను పట్టుకువచ్చి వాకిట్లో తపీమని పడవేసేడు.

నారాయణి వంటయింటి గుమ్మంలో నుండి ఆ చేపనుచూచి చూడటముతోనే గుండెను రాయిపడ్డట్టు, వణుకుతున్నా పెదిమితో "ఓరే బాగాయ్! అది మన పెద్దచెరువు రేవులో తిరిగుచుండే కార్తీక, గణేశులలోది కాదురా?" అని అడిగింది,

బాగాయ్ ఇంతతొందరగాపోయి పెద్దచేపను తీసుకొని రాగల్గినందుకు తన ప్రభావాన్ని వెళ్లడిస్తు "చిత్తం అమ్మగారూ

ఆ రేవులో తిర్గే పెద్ద చాపలలోనిదే నండీ! ఎంత పెద్ద చాపను కున్నారు. నే నొక్కడిని మోయలేక పోమేనమ్మాగారూ, దిగం బరివైపు జూపుతూ యీ పెద్దమ్మగారు యేలాఅయిన శ్రమపడి వీటినే తీసుకురమ్మని సెలవిచ్చినారు," అని చెప్పేడు.

నారాయణి తెల్లబోతూ అలానే ప్రతిమలా నిలబడిపో యింది. ఆ యింటిలో వున్నదున్నట్లుగా మాట్లాడగలది. ఒక్క నృత్యకాళిమాత్రమే. ఆమెకు రామ్‌బాబు అంటే అంత అపేక్ష లేదు. అయినా యీ చేపను జూచేటప్పటికి దానికికూడా కోపం వచ్చింది. అది దిగంబరివైపుజూస్తూ " చిన్నబాబుగారి కార్తీక-గణేశులు గూర్చి వూరిలో అందరకూ తెలుసుగదమ్మా, పెద్దమ్మ గారూ! మీరు స్వయంగా యీ చేపను పట్టుకరమ్మన్నారూ? యింకా రెండు, మూడు చెరువు లున్నాయికదా! వాటిలో యెం దులోను చేపలు లేకపోయినవా? పది పదిహేనుమంది తినాలి కదా, దీనివొక్కదానితో సరిపోతుందా?" అని గంభీరముగా అని - "ఊఁ సరే, వెంటనే యెక్కడైనా దాచివేయండి దాన్ని, ఎక్కడుకువెళ్లేడో ఆయన చటుక్కున వచ్చిపడతాడు" అంది.

దిగంబరి ఆ మాటలకు కండ్లెర్రజేసి యిపంతానాకు చాలా విచిత్రముగావుంది. ఒక చేపను తెప్పించేనో లేదుకాని ప్రపంచం అంతా తారుమారైనట్లు జేస్తుయున్నారు - చూస్తూవున్నావుగా! దాన్ని తీసుకెళ్లి దాచెయ్యనా? బ్రాహ్మణులకు వొండి పెట్టొద్దు" అంది.

"బ్రాహ్మణులు పన్నెండు గంటలు దాటినపిమ్మటగా బోంజేసేది. చిన్నిబాబుగారు ముందు స్కూల్‌కు వెళ్లనీయండి

లేకపోతే యీ వేళ చాలా హంగామా జేసి తీరు తారు - అటు యిటు జూచి అరే బోలా యిప్పటిపర్కు ఇక్కడున్నవాడుయెటు పోయేడు వాడు యీ కబురు చినబాబు చెవిని వేయుటకెళ్లాడేమో యేమైనా కానీయండి ఇంక అట్టే ఆలస్యం జేయకండి అమ్మ గారూ !" అంది నృత్యకాళి.

దిగంబరి యిస్తానన్నా లంచండబ్బుకు ఆశపడి వల పట్టుకు వచ్చి యీ పనిజేసిన బాగాయ్ యిక్కడ వ్యవహారమునంతా జూచి యిక్కడవుంటే రామ్‌బాబుచే తన్నులు కాయవలసి వుంటుం దని గ్రహించి తనుతెచ్చినవలని చంకనేసుకొని నెమ్మదిగా జారుకున్నాడు.

రామ్‌బాబు ఆ సమయములో తోటలో - జామిచెట్టుపై కూర్చుని జామికాయలుకోసి తింటూవున్నాడు. బోలాకు రామ్‌బాబు ఎక్కడ - యేసమయాని వుంటాడో బాగా తెలుసును. వాడు యిక్క డ జర్గిన విషయాన్నంతాజూచి పరువెత్తుకుంటూ ఇక్కడకు వచ్చి " చిన్నబాబు యింకేముందండీ అయిపోయింద " న్నాడు.

రామ్ క్రిందికిజూచి " యేమిట్రా అయింది " అన్నాడు.

" బాగాయ్‌గాడు. మీ కార్తీకుని చంపివేసేడు బాబు "

" ఆఁ నిజమేనా " అన్నాడు రామ్‌బాబు - " నిజం బాబు అమ్మ గారే ఆజ్ఞాపించేరు ఇప్పటికింకా నడింవాకిట్లోనే చచ్చిపడివుంధి బాబు " అన్నాడు.

రామ్‌చెట్టుమీదనుండి దుబుక్కున క్రింకిదూకి గబగబా పరువెత్తుకపోయి నడింవాకిటనున్న చేపనుజూచి "ఓయ్ బాబోయ్!

యిది నా గణేశ్, గణేశుణ్ణి పట్టుకరమ్మని నీవే చెప్పేవా? వదినా ?' అంటూ క్రిందపడి దొర్లుతూ పీకనరికిన మేకపిల్లలా గిజగిజా కొట్టుకోవడం ప్రారంభించేడు. అతనిదుఃఖం ఎట్టిదో ఆ యేడ్పులో యెంత నిజముందో ఎంత సహించరానిదో యీ నాడు దిగంబరికి అవగాహనం అయింది.

రాత్రికి రామ్‌బాబుకు అన్నం తినుపించుటకు నారాయణి చాలా ప్రయత్నం జేసింది. పగలంతా ఉపవాసముతోవుండి పాపము నాలుగు మెతుకులు తిని లేచేడు.

దిగంబరి తలుపుచాటున నుంచుని, " నీ వొక్కసారి చెప్పకపోతే నారాయణి అన్నం తినెటట్టులేదు. పగలల్లా ఉపవాసముతో పడివుంది. చెప్పిచూడు నాయనా " అంది అల్లుడితో.

" యీ వేళ ఉపవాసము చెయ్యవలసినంత అగత్యం యేమొచ్చింది. " అన్నాడు శ్యామ్‌లాల్.

దిగంబరికి ఏడుపు రాకపోయినప్పటికి కంఠస్వరాన్ని విచారగ్రస్థంగా మార్చి, తప్పంతా నాదే నాయనా ! బ్రాహ్మణుల భోజనాలకని పెద్దచెరువునుండి ఒకచేపని తెప్పించినంతలో యింత రాద్ధాంతమై మహా భారతమంత గొడవవుతుందని నాకు మాత్రం యేం తెలుసు? " అంది.

శ్యామ్‌లాల్‌కు ఆ మాటలేవి అర్థంగాలేదు. అటు యిటు జూచి నృత్తికాళీ అనిపిలిచేడు.. ఆమెవచ్చి నిల్చింది. " యేమి జర్గిందేమిటి " అన్నాడు.

నృత్తికాళి పెద్దచెరువునుండి తెప్పించినచేప చిన్నబాబుగారి గణేశ్ బాబు " అంది.

శ్యామ్‌లాల్ త్రుల్లిపడి " రామ్ కార్తీక గణేశులో ఒకటి గాదదీ ?" అన్నాడు.

' ఆఁ, అదేబాబు " అంది నృత్తి.

అతనికి చెప్పనవసరము లేకపోయింది. విషయాన్నంతా క్షణములో తెలుసుకో గలిగేడు. " బహుశా రామ్‌బాబు భోజనము చేయలేదనుకుంటాను " అన్నాడు.

అతనేమీ యింతవర్కూ ముట్టలేదండీ ?" అంది నృత్తికాళి.

" అయితే యిక నే తినమంటే యేంలాభం ? వాడు తినలేనప్పుడు. యిక యీవిడమాత్రం తింటుందా ?" అన్నాడు.

". యింత గొడవ జర్గుతుందని తెలిసియుంటే నే ఆ బ్రాహ్మణులకు భోజనములమాట తలపెట్టనైనా తలపెట్టేదాన్ని కాదు నాయనా ! ఆమే స్వయంగా ఆ చేపను పట్టుకురామని ఆజ్ఞాపించి తెప్పించి యిప్పుడిట్లా యిదంతా యెందుకు జేస్తుందోబాబు నాకేమి అర్థంగాకుండావుంది. యీ తప్పంతా నాదిలాగునే కన్పడుతుంది. పోనీలే నాయనా ! మమ్మలను ఎక్కడకో ఒక చోటికి పంపివేయి యిక యిక్కడవుండ్డానికు మా కేమంత ధైర్యంకూడా లేదు. " ఒక్కక్షణం వూరుకొని బలవంతాన కన్నీళ్లతెచ్చుకొంటూ చెప్పుట ప్రారంభించింది.

" నా దురదృష్ట దినాలు యీలావుండకపోతే మహా పుణ్యాత్ముడైన మా అన్నగారు ఎందుకు మరణిస్తాడు ? మాటికి చీటికి చీవాట్లు చెప్పుదెబ్బలుతింటూ నా కర్మంకాలి యిక్కడెందుకు పడివుండాలీ ? నాకేమి పాలిపోటంలేదు నాయనా ! నీకు నే రెండు

కరములు మోడ్చి చెప్పుతూవున్నాను. మాకేదైనా ఒకదారి చూపించు బాబు!" అంది.

శ్యామ్‌లాల్ ఆమె మాటలకు తటపటాయిస్తూ అలానే నిలబడిపోయి అవును కాదు అని యేమాట ఆడలేకపోయేడు.

నారాయణి తలుపుచాటున నుంచుని తనతల్లి కల్లబొల్లి మాటలు వున్నవి లేనివి కల్పించి తనభర్తయెదుట సిగ్గు బిడియం లేకుండా చేతులు తిప్పుతూవుంటే లజ్జతో వొళ్లు జలదరించి కుళ్లిపోయింది. ఆమె అక్కడనుండి తిర్గివచ్చి రామ్‌బాబు పడుకున్న గది తలుపుతట్టుచు "చూడుబాబు తలుపుతీయి నాయనా నా బంగారు బాబువికావూ యీ ఒక్కసారితియ్యి." అంది.

రామ్‌బాబు మేలుకొనేవున్నాడుగాని, పల్కలేదు.

నారాయణి మళ్లీ కేకవేస్తు "లే తలుపుతీయ్" అంది.

రామ్ తలుపుతీయక లోననుంచి నే తియ్యను, నువ్వక్కడనుండి వెళ్లిపో మీరందరూ నాకు శత్రువులే" అన్నాడు.

"సరే, అయితే అయ్యేములే ముందు తలుపుతీయ్" అంది

"ఉహుం, నే తియ్యనంటే తీయను. అని ఆ రాత్రి రాముడు తలుపుతీయనేలేదు.

శ్యామ్‌లాల్ తనగదిలో నుండి అన్నివింటూనే వున్నాడు. కొంతసేపు గడిచేకా నారాయణి గదిలోనికిరాగానే శ్యామ్‌లాల్ "ఏదో ఒక పంథా జూడు. లేదా నా యిష్టమైనచోటికి నే వెళ్లిపోతాను. యింత రభస నే భరించలేను" అన్నాడు.

నారాయణి విశ్చేష్టురాలై ఆలోచించసాగింది.

* * * *

వారంరోజులు గతించిపోయేయి రామ్‌బాబుకు మాత్రం కోపం కించెత్ తగ్గిలేకపోవుట జూచి నారాయణికి ఉదయారాటము, క్షోభ, విరక్తి కల్గుతున్నాయి. యీ వేళ సూర్యుడు అస్తామించేడు. రామ్‌బాబు యింతవర్కూ స్కూల్‌నుండి రాకపోవుట చూచి నారాయణి ఆదీసురాలు కాసాగింది. యీవేళప్పుడు దిగంబరి నదిలోస్నానంజేసి దేశములో ఎక్కడెక్కడ విషయాలు ఆకలింపు జేసుకొని రామ్‌కు అమంగళంజర్గాలని వెయ్యి దేవతల పేరునా మొక్కుకొంటూ సృష్టిలో ఎవ్వరికీలేని తెలివితేటలున్నందుకు తన పెద్దకూతురికి త్వరలో జర్గబోవు పరాభవ ఫలాఫలాలు ఇరుగుపొరుగు అమ్మలక్కలదగ్గర వెళ్లబోసి తనకట్టే వయస్సు లేకపోయినను అనేక కష్టాలవలన తనతల త్వరలోనే మెరిసిందని తనకు నారాయణికి ఇంచుమించు ఒకే వయస్సని తిప్పుకొంటూ తనచరిత్రనంతా చిత్రవిచిత్రమయి జీవితం అని మా సోదరునియింట సర్వాధికారములు చెలాయించేనని తన మాటకు ఆ గ్రామమంతా తిరుగు చెప్పేది కాదని యిట్లా కట్టుకథలెన్నో చెప్పుకొంటు మెల్లిగా యింటిదిశకు కదిలిస్తుయుండగా లారిలో ఒకరివలన ఓ సంఘటన విని ఆ నందాతి రేఖమున మేఘాలమీద తేలిపోతూ తేలిపోతూ ఉరకలువేసుకొంటూ యింట ప్రవేశించినది, నడివాకిట్లో కాలుపెట్టిందో లేదో పెద్ద గొంతుజేసుకొని “ విన్నావే. బుద్ధిమంతుడైన నీ మరది జేసినపని విన్నావా ? నారాయణీ ? అంది.

నారాయణి కంగారుగా పాలిపోయ్ని మొఖంతో “ ఏమిటది ?” అంది.

"వాళ్లు అందరూ కలసి పోలీస్ స్టేషన్‌కు వెళ్లేక యేం జేస్తారో నే జెప్పలేనమ్మా! యింక మొండిబంద పిల్లాడ్ని యేజన్మలోను చూడలేదు తల్లీ!" అంది.

ఆమె మొఖంలో కళ్లలో ఆనందజ్వాలలు ప్రసరిస్తుంది నారాయణి ఆమెమాటలకు జవాబుచెప్పకుండా "నృత్తికాళీ రామ్ బాబు యింకా స్కూలునుండిరాలేదు. ఎందుకురాలేదో ఒక్కసారి బోయానుపంపి వెదికి తీసుకరమ్మని చెప్పు" అన్నది.

"నే నంతా అందరవలన వినివచ్చి చెప్తున్నానుగా" అన్నది దిగంబరి.

నారాయణి తల్లిమాటలు ఖాతరుచేయక నృత్తివైపుజూచి "వెళ్లవేనృత్తి వేగరముగా పంపు పో" అంది.

దిగంబరి తనకంఠస్వరము హెచ్చుస్థాయికిమార్చి ఉద్వేగముతో 'యేం జరిగిందనుకుంటున్నావూ' నారాణి అంటూ ప్రారంభించింది. 'నువ్వు యింటిలోనికిపోయి ఆ తడిబట్టవిప్పుకొని పొడివికట్టుకొని రావమ్మా తరువాత చెప్పుదువుగాని' అని నారాయణి అక్కడనుండి గుమ్మందగ్గరకు పోయింది. దిగంబరి వెల వెలబోతూ "ఛశే! నాతల్లి కోపంజూడాలి" అని తనహృదయములో అనుకొని ఇట్లాటి విషయాన్ని చక్కగా చెప్పేటందుకు వీలుచిక్కక కుదరకపోవటంవలన ఆమెపొట్ట ఉబ్బిపోతుంది.

అసలు జర్గిన విషయమేమంటారా ఇది: ఆ వూరి జామిందారుగారి పుత్రుడుకూడా ఆ స్కూలులోనే చదువుచున్నాడు. మధ్యాహ్నం ఇంటర్‌విల్‌లో రామ్‌బాబుకు అతగానికి తగాదా ప్రారంభంఅయింది జటిలమైన విషయంమూలాని విస్తారము

మీమాంసజర్గిక దెబ్బలాటవచ్చింది. శ్మశానకాళి రక్షకాళికన్నా పెద్దదేవత యెందుకంటే శ్మశానకాళి నాలిక చాలాపెద్దది యీ విషయం మన శాస్త్రగ్రంధాలటు వ్రాసేయున్నారు పెద్దలు. అన్నాడు, జమిందారు కొడుకు.

రామ్‌బాబు అన్నాడుగదా శ్మశానికాళి నాలిక కొంచం వెడల్పు అయితే వుండవచ్చుగాని అయితే అంతపెద్దది కాదం టాను. పైగా ఎర్రటిదిగాదు. కొన్నాళ్లక్రితం ఆ వూరివారందరు చందాలు పోగుజేసి రక్షకాళికి పెద్ద ఉత్సవం చేయుంచేరు. ఆ విషయం రామ్‌బాబుకు జ్ఞాపకముంది. జమిందారుగారబ్బాయి రామ్‌మాటలు యదార్థాలుకావని తనచేయినెత్తి " రక్షకాళి, నాలి కింతే " అన్నాడు.

రామ్‌బాబు అన్నాడు " ఏమిటీ ? అంతచిన్నది యెప్పటికీ కాదు అంత చిన్నదైతే యీ లోకాన్ని అంతా యేలా కాపాడు తుంది. అవిడకి రక్షకాళిఅని పేరుగూడా వచ్చిందే " అన్నాడు.

తరువాత వొకటీ రెండు మాటలుపై మాట్లాడుకున్నారేమో కొట్లాట ప్రారంభం అయింది. జమిందారుగారబ్బాయి శరీరం పుష్టిలేదు. అతగానికి మొఖంపైనొక దెబ్బపడ్డది దానితో ముక్కు అదిరి కొద్దిగా రక్తంకారింది. యీ చిన్నస్కూలు స్థాపించిన నాటి నుండి యింత పెద్ద దెబ్బలాట జర్గలేదు. అందులో జమిందారు గారిస్కూల్ పైగా జమిందారు గారబ్బాయి దెబ్బలుదినుట, మాష్టర్లు గాభరా గాభరా పడిపోతున్నారు. హెడ్‌మాష్టర్ జమిం దారు అబ్బాయిని తీసుకుని దివాణంలోకి బైలుదేరినాడు. రామ్ బాబుమాట జెప్పనేలా వాడంతకుముందే అంతర్థానమైనాడు.

బోలా అక్కడక్కడ తిర్గివచ్చి - " చిన్నబాబుగారెక్కడ కన్పడలేదు అమ్మాగారు " అన్నాడు.

యింకో అరగంటకల్లా శ్యామ్‌బాబు వెలవెల పోతూవున్న మొఖంతో ఇంటికివస్తున డింవాకిట్లోనిలబడి " యీ విషయమంతా వినేవుంటావ్ అనుకుంటా ? ఇకమనం యీ గ్రామమునుండి వలస పోవలసి వుంటుంది. ఆకరకు మనతలరాత యీ మాదిరిగా వ్రాసి వుందికాబోలు చూస్తున్నావుగా ? ఏదోనొకరిచేసి రెండబ్బులు యింటికి తెస్తున్నానుగదా అంటే యింక యిదికూడా గట్టుబడిపోతుందిప్పుడు. " అన్నాడు.

నారాయణి గదిలోనుండి బైటికివచ్చి ఆరిపోయినగొంతుతో " వాళ్లందరూ పోలీస్‌స్టేషన్‌కు వెళ్లారా యేమండీ ?" అన్నది.

శ్యామ్‌లాల్ తలఆడిస్తు " జమిందారుగారు కేవలం శివ తుల్యుడు. గాబట్టి క్షమించేడు. అయితే లోకులున్నారుగా ? ప్రతి దినం యీలానే యేదో ఒక ఉపద్రం తెచ్చిపెట్తూవుంటారు. అలాటప్పుడు యీ గ్రామంలో మనమెట్లా కాపురం చేయడంచెప్పు ?" క్షణంవూరుకొని - ' రామ్‌బాబు ఎక్కడ !' అన్నాడు.

" అతనెక్కడకో పారిపోయివుంటాడండీ ? భయముతో పాపం చిన్నపిల్లవాడు " అన్నది నారాయణి.

" ఉహూ - యికవాడితో సంబంధములేదు - వాడు నాపవిత తల్లి కొడుకు యీ లోకం యేమనుకుంటుందోయని భయపడుతూ యింతకాలం నెట్టుకువచ్చేను. యిక మన ప్రాణ, మాన, ధనమే పోయేటట్లువుంది. గాన, నే నహించలేను. యిక మన ప్రాణాలను కాపాడుకోవల్సి వుంటుంది " అన్నాడు శ్యామ్‌లాల్.

దిగంబరి ఆ ప్రాంతానే నిలబడివున్నదల్లా " నీ వన్నది నిజం బాబు నిజమే దేవు. మన గోవిందుబాబుని జూచుకొనవలసివుంటుంది " అన్నది.

" చూసుకొనక్కరలేదా ? మరి తప్పకుండా చూచుకొనవలసేవుంది. గనుక రేపు నలుగురు పెద్దమనుష్యుల యెదుట వాడి భాగము వాడికిచ్చివేస్తాను. నారాయణి వైపుజూచి యిక నీవేమి వాడ్ని మంపలించి కొట్టనవసరములేదు.వాడికేది మంచిదని తోస్తే అదే జేసుకుంటాడు. మంచిదనేకాబోలు జమిందార్‌గారి అబ్బాయిని కొట్టేడు, అందుకు యీ విధముగా ప్రతిఫలం అనుభవించు తీరవలసిందే !" అన్నాడు శ్యామ్‌లాల్.

దిగంబరి ఆ మాటలన్ని విని ఆనందము పట్టలేక పోతూ ఓ నారాణీ విన్నావమ్మా మా నాయన యెంతధర్మంగా చెప్పుతూ వున్నాడో అయినా నీ కెందుకమ్మా అతనిని అంత అదుపాజ్ఞలలో పెట్టుకోవడము అతనిని జూస్తువుంటే నాకే వణుకు పుట్టుతుందాయే అదెక్కడ జన్మోగాని పెంకిదిప్పకాయిబాబు, నన్నే యిలా రోజుతిట్టి, కొట్టేటంత హంగామా జేస్తుయుంటే ? శ్యామ్‌లాల్ వైపుతిరిగి దాన్ని అవమానించటమనేది వాడికొకలెఖ్ఖా జమా ? మర్యాదున్నపుడు యెవరి , మర్యాదవారి కుంటుంది అంతేగాని. ఆం, యికవాడితంటా యెవ్వరికికావాలి అంటానునేను " - అంది.

శ్యామ్‌లాల్ అత్తగారిమాటలు సవ్యంగాలేక సమర్ధించలేక పోయేడు. కొంత సిగ్గుకూడాచెందేడు " యేమయితే అదేఅవుతుంది కాని, యికనీవు వాడిని అదుపాజ్ఞలలో ఉంచనవసరము " లేదన్నాడు.

నారాయణి శిలా ప్రతిమలా నిలబడిపోయి వారి వారి మాటలన్నివిని జవాబుచెప్పక నెమ్మదిగాకదిలి లోనికెళ్లి తనపను లలో నిమగ్నురాలైంది.

కొంత సేపయేక రామ్‌బాబు సన్నసన్నగావచ్చి తన గది లోనికిపోయి మంచంపైబడి వెల్లకితల పడుకొని యేమోఆలో చించుకొంటూ వున్నాడు.

నృత్తికాశి రామ్‌బాబురాక గమనించి నారాయణి చెంతకు వెళ్లి "అమ్మ! అమ్మా, చిన్నబాబువచ్చెడమ్మా" అని మెల్లగా చెప్పింది.

నారాయణి నిశ్శబ్దముగాలేచి రామ్‌బాబు గదిలోనికివెళ్లి గొళ్లెంపెట్టింది. రామ్ గొళ్లెంచప్పుడువిని చట్‌నలేచి క్రిందికురికి ఒకమూలకెళ్లి నిలబడ్డాడు. నారాయణి అక్కడవున్న పేము బెత్తము బట్టుకొని "యీలారా," అనిపిలిచింది.

రామ్‌బాబు రెండుకరములు జోడించి "యింకెప్పుడు చెయ్యనువదినా! యీతూరి వదిలెయ్యి!" అన్నాడు.

నారాయణి కోపోద్రేకమున "ఇలావచ్చెవా తక్కువ దెబ్బలు తగులుతాయి లేదా చూడూ యీ బెత్తం నీవీపుపై చిట్లి పోతాది. తెలుసుకో" అంది.

రామ్ కదలక అతివినయంగా "ఇంకెప్పుడు చేయను వదినా? నే చెంపలేసుకు చెప్పుతున్నా" అన్నాడు.

నారాయణి మంచంమీదపంగి వీపున ఒక్కదెబ్బవేసింది. యిక దెబ్బమీదదెబ్బ పడసాగేయి రామ్‌బాబు అటువున్న తలుపు

తీసుకు పారిపోదా మనుకున్నాడుగాని అవకాశము చిక్కలేదు. ఆత్మరక్షణకు అనేకవిధాలు ప్రయత్నం జేసేడుకాని విఫలుడైనాడు. యిక చేసేది యేమిలేక చివరకు వదినగారి కాలిపైబడి "బాబోయ్" అంటూ పెద్దకేకలువేసుకు ఏడ్వడము ప్రారంభించేడు. నృత్తికాళి యీ దృశ్యాన్ని కిటికీగుండాజూస్తు కండ్ల నీరు తెచ్చుకొంటూ "యికవదలండమ్మగారు యిక నే వేడుకొంటూ యున్నా!" నంది!

పక్కనేవున్న దిగంబరి ముఖం ధుమధుమలాడుతూ "ప్రతిదానికి నీవేదో పెద్దఆరిందాలా చెప్పవస్తావెందుకే" అంటూ నృత్తికాళిని అక్కడనుండి కొంచెం యివతలకు లాగింది.

శ్యామ్‌లాల్ తనగదిలోనుండి "యేమిటది రాత్రితెల్లవార్లు అలాకొట్టుతూనేవుంటావా యేం" అని కేకవేసేడు.

నారాయణి బెత్తం అక్కడపారేసి "జ్ఞాపకముంచుకో యేమనుకొన్నావో" అంది.

# నాలుగు

రామ్ విస్తరిముందు కూర్చుని భోజనం జేస్తున్నాడు తలవంచుకొని.

దిగంబరి ఆచాటున కూర్చొని బిగ్గరగా అందరుకు విని పడేటట్లు గొంతుజేసుకొని " అంతవయస్సు పిల్లవానిపై అన్న గారే చేయిజేసుకోరే ఎన్నడును ? అలాటిది నువ్వెందుకలా ఆ పిల్లవాన్నిగొట్టడం నారాయణీ !" అంది.

నృత్తికాళీ యీ మాటలువిని " వూరుకోండి పెద్దమ్మగారు మీరే మా అమ్మగారికి పురిఎక్కించివదిలేరు ఆపైని కోపమాపుకోలేక చెయ్యిజేసుకున్నారు. " అంది.

ఆ రాత్రి అన్నిదెబ్బలు రామ్‌బాబుని కొట్టడం నృత్తికాళికి యేమంత బాగుండలేదు - రామ్‌బాబు నృత్తికాళిమాట ఆలకించి తలపైకెత్తి గుడ్లు పెద్దవిజేసి కోపాన్ని " ఆముసలి దయ్యం మమ్ముల నందర్ని పొట్టని పెట్టుకోవడానికివచ్చిన రాక్షసి " అన్నాడు.

దిగంబరి ఆ మాటలువిని బిగ్గరగాకేకలు పెట్టుకుంటూ ఓ నారాణీ - చూడమ్మా నీ మరదిమాటలు - కాస్త వినమ్మా అని " కేకలుపెట్టింది.

నారాయణి స్నానముకు వెళ్లిపోబోయేదలా తిరిగివచ్చి "యిక యీ మాటలన్ని వినలేనమ్మా! ఇంతకంటే చచ్చిపోతే సుఖంఅనుభవించవచ్చు ననుకొంటా, యేమే నృత్తి నేనిక సహించ లేకపోతున్నానే రామ్‌పై పుజూచి. ఓ కోతి! నీ వీపుపై తట్టులు యింకా పోనేలేదు. అప్పుడే అన్నిమరిచిపోయేవా!" అంది.

రామ్ తలపైకెత్తకనే భోజనం జేస్తునేవున్నాడు. నారాయణి యింకేమి మాటాడకుండా స్నానంకు వెళ్లిపోయింది. రామ్‌బాబు అన్నంతినగానే నడింవాకిట్లో ఒకమూలనున్న జామి చెట్టుఎక్కి పచ్చి పసరు అనక చేతికి దొరికినకాయనల్లా కోసి గిరాటువేస్తువున్నాడు. యీ దృశ్యం దిగంబరిజూచి వళ్లు మండుక పోయింది. నారాయణి స్నానానికివెళ్లింది. చెప్పుటకు యెవ్వరు లేక యిక సహించజాలక "నీకేమొచ్చిందిరా కటికికాయలన్నీ కోసి పారివేస్తున్నావు." అంది.

రామ్‌బాబు ఆమె మాటలను యేనాడు లెక్క చేయలేదు. కాగా ఇప్పుడే నృత్తికాళివద్దవిన్నాడు. తను యిన్నిదెబ్బలు తినుటకుకారణము అందుచే కోపంపట్టలేక చెట్టుమీదనుండే "ఓ ముసలివరడా బాగా జేస్తానుండు" అన్నాడు.

యీ మాట అంటే దిగంబరి మండిపడిపోతాది. సహించలేనిది వికారముగా ముఖంపెట్టి "ముసలవరడనా? బాగాజేస్తావా! రాని దాన్ని! ఎంత సిగ్గు బిడియాలులేని పిల్లాడోబాబు! అన్ని దెబ్బలతో వీపుచిట్లిపోయినా ఇంకా సిగ్గులేదు." అంది

రామ్‌బాబు - చెట్టుమీదకూర్చోని ఓ ముసలిదయ్యమా?" అని కేకవేసేడు.

“ ముసలిదయ్యాన్నా ? నీ పాడుమొఖం ఎలావుంటో ఆ మాటలు అలానేవున్నాయి. పాపాత్ముడా ? దిగరా చెప్పరా నీ పని!”

“ నే నెందుకుదిగాలే యీ చెట్టు నీ బాబుదా ?” అన్నాడు.

దిగంబరికీమాటతో ఉడికెత్తిపోయింది. “ ఆఁ, ఆఁ, మా బాబు పేరెత్తుతున్నావుగా ? విన్నావా నృత్తి నీవేసాక్ష్యంఅమ్మ” అంది. సరిగా అదేసమయానికి స్నానం చేసుకొని నారాయణి లోనికివస్తూ చెట్టుపైరాముని జూచి “ స్కూల్ వేళాయినట్టుంది. అన్నంతిని వెళ్లకపోయేవా ? చెట్టెక్కికూర్చున్నావు.” అంది.

చెట్టుమీద కూర్చుని దూరానవదినగారు రావడము జూచి దిగివెళ్లి పోదామనుకున్నవాడు. దిగంబరితో మాటలసందర్భములో మరచిపోయేడు. తీరా వదినగారు నడిమివాకిటవచ్చి నిల్చోడముజూచి భయపడుతూ గాభరాగా “ జామికాయలు తింటున్నా వదినా ?” అన్నాడు.

“ తినడానికేమిలే స్కూల్ మాట మరచిపోయేవా ?” అంది.

“ కడుపునొప్పి పెట్టుతుందమ్మా వదినా ?”

“ అందుకనేనా పచ్చి జామికాయలు మింగుతున్నావ్ ?” అంది.

దిగంబరి యింతలో కూతురిగొంతు ఆలకించి పరుగెత్తుకు వచ్చి – “ యీ పాపిష్టిముండవాడు. నా బాబు పేరెత్తుతున్నాడు. చెట్టుదిగరా అంటే యిది నీ బాబుచెట్టా ? యని అన్నాడు చూడమ్మా నారాణి ” అంది.

నారాయణి రామ్‌బాబువైపుజూచి “ నిజమేనా అన్నావా ?” అంది.

రామ్‌బాబు ముఖం చిన్నబుచ్చుకొని "నే నలాగున అన లేదు. అన్నీ అబద్ధాలు వదినా" అన్నాడు.

దిగంబరి నెత్తి నోరుకొట్టుకుంటూ "ఆలా అనలేదూ దౌర్భాగ్యుడా, నృత్తికాళి సాక్ష్యం లేదనుకున్నావా? మూతి వికారముగా పెట్టి — ఆ నాడు దెబ్బపై దెబ్బ పడుతున్నప్పుడు. యిక చేయనులే వదినా! దానికాళ్లపట్టుకు కేకవేసేవు అప్పుడే మరచి పోయేవు, నిన్నరోజూ! మర్దించవలసిందే అప్పుడుగాని రోగం కాస్తా కుదురదు. దౌర్భగ్యదామోదరా, నిన్నువిడిస్తే మనిషివి కావు" అంది.

రామ్‌బాబు యిక దిగంబరి ఉపన్యాసమును సహించలేక పోయేడు. ఆ సమయములో అతని చేతిలో పచ్చి జామికాయ వొకటుంది. అదితీసి విసిరేసరికి దిగంబరిపక్కనే నిలబడివున్న నారాయణి కుడికన్ను బొమ్మమీద చట్‌న గట్టిదెబ్బతగిలింది. ఆ దెబ్బకుకన్నులు జిగేల్‌మన్నాయి. ఆమె క్రిందకు వాలి పోయింది. దిగంబరి భయాతిరేకాని పెద్ద బొబ్బలెట్టసాగింది. నృత్తి చేతిలోపని నావలపెట్టి పరిగెత్తుకవచ్చింది. రామ్‌బాబు యీ దృశ్యాన్నిజూచి గుండె దడదడా కొట్టుకొంటువుండగా పక్క గుమ్మంనుండి బైటికి దాదితీసేడు. దిగంబరి నృత్యకాళి ఆమెను తీసుకొని లోన ఆమెగదిలో పరుండబెట్టి కొద్దివుపచారములు జేసేరు, నృత్తి చాలా సేపటినుంచి విసురుతుంది.

శ్యామ్‌లాల్ మామూలుగా కచ్చేరిపని మధ్యాహ్నం ముగించుకొని భోజనానికి యింటికివచ్చేడు. రాగానే నారాయణి

గదిలోనికిపోయి జూచేడు. ఆమె కంటికితడిగుడ్డ జుట్టుకొని వొకపక్కకుతిర్గి పడుకొనివుంది. నృత్తికాళిమాత్రం ఉపచర్య జేస్తువుంది. యీతూరి దిగంబరి అల్లునికి ఎదుటబడి "నారాయణిని రామ్‌బాబు చంపేశాడని" ఇంటికప్పు ఎగిరిపోయేటట్లు ఏడ్వడం మొదలెట్టింది.

శ్యామ్‌లాల్ ఆమె యేడుపుకు కంగారుపడి నారాయణి వద్దకువెళ్లి ఆ దెబ్బనుజూచి సరే నే నీవేళ వొట్టేసుకు చెప్పుతు వున్నాను. నీవువాడికి అన్నం పెట్టినాసరే లేదా మాట్లాడినాసరే నామీదవొట్టే . అన్నాడు కఠినస్వరాన.

నారాయణి మృదుస్వరంతో అన్నాది, "వూరుకోండి అటు వంటిమాటలు నాలికముందుకైనా రానీయకండి యెవ్వరైనావింటే నవ్విపోతారు" అంది.

"ఊహూఁ ఇంతపెద్దవొట్టును నీవు పాలించకపోతే ఆనాడు నీవు నా శవాన్ని జూస్తావు జాగ్రత్తా అని డాక్టర్ను తీసుకొస్తానని" బైటికి వెళ్లిపోయేడు,

రామ్‌బాబు ఉదయానే పారిపోవుట తిన్నగానదివొడ్డుకు వెళ్లి కొంతసేపుకూర్చొని కొంచంసేపు నిలబడి అటు ఇటు పచారిలుజేస్తూ అసంబవములైన ఆలోచనాసముద్రంలో తేలియాడి యేమీతోచక ఆరోజుఅంతా ఆ ప్రాంతముననేవుండి. సూర్య హస్తమయంకూడా జూచి కొంచం చీకటి పడుతూవుండగా గప్ చప్‌గావచ్చి యింటిలో దూరేడు. యింటిలోకివచ్చేసరికి నడిం వాకిటిమధ్య తడిక అడ్డం కట్టబడివుంది. ఇల్లాంతా కలియజూచేడు.

అన్నీ రెండుభాగాలుగా చేయబడివున్నాయి వంటయింటిలో దీపం వెలుగుతువుంది అటుతొంగిచూచేడు అచ్చటా రెండుభాగాలుగానే వున్నాది. అంతా కదిపిజూచేడు తడకలేమి కదలక గట్టిగా వున్నాయి. యీ వైపువాటాలో యెవ్వరులేరు. ఇదంతాజూచి ఉదయాన జర్గిన సంఘటనకు దీనికి యేదో సంబంధమున్న దనుకొని నిశ్చేష్టుడై గుండెదడబడా కొట్టుకోవడం ప్రారంభ మైంది. తిన్నగా ఆ యింటిలోనికెళ్లి కూర్చున్నాడు. యెదుట టేబిల్‌పై కంచుగ్లాసులు కొన్ని యిత్తడిచెంబులు క్రిందకొన్ని, వంటపాత్రలు మున్నగునవి కుప్పలుగా పడివున్నాయి. కొంతసే పయాక కొంచం తేరుకొని అవతలయింటినుండి యేమైనా మాటలు వినపడతాయేమోనని ప్రయత్నం చెసి చూచేడుకాని ధ్వని యేమీలేదు. చాలా నిశ్శబ్దముగావుంది. ఇంతకుముందు సంధ్యావేళ లోనే యెంతో ఆకలివేస్తుయుండేదే ఇప్పుడు రాత్రి తొమ్మిదైనా ఆకలిలేదు. యీ వేళవుదయము తిన్నదే మరేమితీసుకొనలేదు. అయినప్పటికి కడుపు ఆకలితో దహించుటలేదు. వాడికిక యేమీ తోచలేదు, ఒక్కసారి వదిననుజూచి వద్దామనిపించి. వెనుక దొడ్డి వైపునవెళ్లి "నృత్తికాళీ, నృత్తికాళీ," అని కేకవేసేడు. నృత్తి కాళీవచ్చి తలుపుతెరిచి పక్కకుపోయి నిలబడినది "వదిన యెక్కడవుంది నృత్తి?" అన్నాడు రామ్‌బాబు.

"గదిలో పడుకొనివున్నారు చిన్నబాబు" అంది నృత్తి.

రామ్ ఏకాయకిని వదినగదిలోనికి వెళ్లేడు. అటుజూచే సరికి వదిని మంచముపై గోవిందునేసుకొని పడుకొనివుంది. క్రిందచాపపై దిగంబరి ఆమె చిన్నకూతురు కూర్చొనివున్నారు.

గోవిందుడు రామ్‌బాబువచ్చుట చూడగానే మంచంపైనుండి ఒక వురుకు వురికి చెయ్యపట్టుకొని "చిన్నబాబాయ్ - అదిగో ఆ యిల్లు నీది. యీ యిల్లు మాది నీవుగాన మాయింటలోకి వచ్చి నట్టయిన కాళ్లురెండూ విరగగొడతానన్నాడు. నాన్న" అన్నాడు.

రామ్ నారాయణి పడుకున్నమంచం కాళ్లవైపుకెళ్లి పాద ములపై తల మోకరించి నమస్కారము చేయబోయేడు ఆమె కాళ్లు వెన్కకుతీసుకొంది. అతనలానే కొంచంసేపు కూర్చున్నాడు.

దిగంబరి చిన్నకూతుర్ని ముందుకుతీసి "చెప్పవే సురధో మీ బావ అతడొచ్చిన యేమి చెప్పమన్నాడోచెప్పు. ఏం అలా కుర్చుంటావేం ? అన్నాది.

సురధు అన్ని వక్కసారి వల్లించుకొని పాఠం వొప్ప జెప్పనట్లు "మా బావగారు నిన్ను యీ యింటిలో కాలుపెట్టవద్దని రేపు 'ఆఁ అదియేమిటమ్మా' జ్ఞాపకమొచ్చింది - డబ్బు - ఆస్తి - అన్ని పంచిపెట్టుతామన్నాడు." అంది.

దిగంబరి అంది "వొట్టువేసుకొన్న విషయంజెప్పవేమి ?" అంది.

"ఆఁ, బావగారన్నారు - యిక నీవువానికి అన్నంపెట్ట వద్దు. వాడితోమాటాడవద్దు. నీమీదవొట్టేనూ, అని యింకా యేమన్నాడంటే ?" -

నారాయణి మంచంమీదనుండి చెల్లెలను గదమాయిస్తు ! సరే నీవిక నోర్ మూయ్ అన్నీ అయినాయితే నీవుమెదలక ఊరు కోనుండు అంది.

అప్పుడు దిగంబరి అందుకొని అంది - అవునోయ్ రామ్ నీవు అందర్నీ చంపేస్తుంటే వొొట్టేయక యిక యేంజేస్తాడు. పాపం ఆయన ధర్మరాజులాటివాడు. కనక యింతకాలం సహించి వూరుకొన్నాడు. ఆయనదేమి యిందులో కాసంతైనా తప్పు వుందనుటకు వీలులేదు. యిక యీ యింటిలోనికి నీవు వొొస్తు పోతూ వుండడానికిగాని తినడానికి - గినడానికి యెంతమాత్రం అవకాశంలేదు. నాయనా, నారాణి మొగుడు పెట్టినవొొట్టుకు కట్టుబడివుంది తీరవలసిందేగా " అంది.

యింతలో చిన్నకూతురంది " అమ్మా అన్నం పెట్టుదువుగానిలేవే నా కాకలివేస్తుంది - నిద్రకూడా వొొస్తుంది. " అంది.

" కాస్సేపు వోర్చుకోవే ముద్దా ?" అంది దిగంబరి.

" అబ్బా నేనిక ఆగలేనుతల్లీ " అంటూ అలానే వొొరిగింది ఆవలించుకొంటూ సురధ.

రామ్‌బాబు అప్పటికీ అలానే కూర్చున్నాడు. ఆ సమయములో యిల్లు తగలబడిపోతువున్నా లేచేవాడుగాలేడు రాముని హృదయములోనుండి దుఃఖంపొంగిపొర్లివస్తువుంది గాని ఆపుకొని అలానేవున్నాడు. ఉదయానికి ధిగంబరి తనను ఆడిన అవమానపు మాటలు పెద్దగోడవలా హృదయానికి అడ్డుపడ్డాయి. అంచేత ఏడవనూలేకపోయేడు. " యికనేనిప్పుడు చేయనువదినా " అని కూడా అనలేకపోయేడు. ఆ వొొక్కమాటే యిన్ని సంవత్సరముల నుండి ఆపదలలో అడ్డుపడుతూవచ్చింది. యీరోజు ఆవక్కమాట అనలేక హృదయం దహించుకు పోతున్నట్లువుంది.

ఇట్టివాని అయోమయస్థితిలో నారాయణి పెద్ద నిటూర్పు విడిచి గద్గదకంఠస్వరముతో "సురధ! అతగాన్ని అక్కడనుండి లేచి వెళ్లిపొమ్మని చెప్పు" అంది.

యీ మాటలకు పొంగివస్తుయున్న దుఃఖాన్ని దిగమ్రింగి. "ఆఁ, అతణ్ణి యిక్కడనుండి వెళ్లిపోమనిచెప్పు! నాకేం ఆకలి వేయుట లేదనుకొన్నావా? ఉదయాన్ని రెండు మెతుకులు తిన్నాను అంతే?" అన్నాడు.

నారాయణి ఉద్వేగమున "నన్నొకసారిగా ఖూనీచేసి వేయ్యలేకపోయేవా? అలా అయివుంటే నాల్గుచేతులతో తినేవాడి వేగా! వెళ్ల నృత్తికాళివద్దకువెళ్ల నాకేమి తెలియదు నన్ను వేదించనూవొద్దు" అంది.

"నేను నృత్తికాళివద్దకు వెళ్లను. మరెవ్వరువొద్దకుపోను. నే నేమి తినకుండా యీవేళ ఉపవాసం జేస్తాను నాకు ఉపవాసం జేయుట తెలియదాయేం?" అంటూ దబదబా కాళ్లు క్రిందకొట్టుకుంటూ యిల్లదరే కేకలువేసుకొంటూ హంగామాజేస్తు తనవాటా యింటిలోనికి వెళ్లిపడుకుకొన్నాడు.

కొంచం సేపటికి నృత్తికాళి కొన్నిపలహారాలు పాలు అవి తీసుకొచ్చి "చిన్నబాబుగారు లేవండీ యివికాస్త నోటిలోవేసుకు పరుండండి లేకపోతే కడుపు మండుతుంది" అంది.

రామ్ తన మంచంమీదనునుండి ఒక్కగెంతువేసి "నీ వెళ్లిపో నృత్తికాళీ నేను యీ రోజుయేమి తీసుకోను వెళ్లిపో యిక్కడనుండి" అని అరిసేడు నృత్తికాళి అటనుండి బిరబిరా బైటికివెళ్లిపోయింది. పలహారాలు అక్కడనేవుంచి వెళ్ళినది.

రామ్‌బాబు కాళీగ్లాసులు నడింవాకిటకు విసరికొట్టేడు దన్ మని యింకా కొంత హడావిడిచేసేడు ఆరాత్రి.

మరునాడు ఉదయాన్నే శ్యామ్‌లాల్ కచేరీకి వెళ్లిపోవుట జూచి రామ్‌బాబు - నడింవాకిటలో తనవాటావైపు పచారిలుజేస్తు పెద్దగొంతుతో "మా అన్నయ్య వొట్టువేసేడట ఓ పెద్దవొట్టే. ఆయన యిష్టమైనట్టు వొట్లు వేసేస్తేసరా! అయిపోతుందా నే నీ వొట్టుకు వొప్పుకోను యెవ్వరెన్ని విధాలైనా అననీగాని నే నొప్పుకోను - వొప్పుకోపోతే యేంజేస్తాడేంటి నరికేస్తాడా? ఆయన నాకు స్వంతఅన్నయ్య యేమిటి ఆయన్ను ఎన్నడైనా తిట్టేనా? లేకకొట్టేనా! ఆ ముసలివరడవుందే దానిపైకోపంకొద్ది దాన్ని కొట్టాలని కొట్టేగాని నా దురదృష్టవశాత్తు అది మా వదినగార్కి తగిలింది. యింతటిదానికి ఆయనవచ్చి యేమీ తెలుసుకోకుండా ఆయన యిష్టంవచ్చినట్లు వొట్టు పెట్టివేయడమేనా?"

యీలా మాట్లాడిన మాటలకు ఆ వాటానుండి యేమి సమాధానంరాలేదు. అంతా నిశ్శబ్దముగావుంది. ఒక్కక్షణం నిరీక్షించి యెవ్వరూ మాటాడకపోవుటజూచి కొంచం కంఠస్వరాన్ని తగ్గించి "మంచిదే! బాగుంది! మాట్లాడపోతే నాకు మంచిదే నాకు చేతకాదా అన్నంవొండుకు తినడం అన్నం, కూర, పప్పు, చేపలు, అన్ని చక్కగా వొండుకొని హాయిగా తినగలను. నే నొక్కణ్ణే తిని పడుకుంటా యిదికూడా చేతకాదంటారా? చూడండీ నా మజాకా" అంటూ చరచరా వంట యింటిలోనికెళ్ళి చెంబు గ్లాసులు దబదబా పడవేస్తు వొరే బోలా!

యిలారారా, చూడు యీ కూరగాయలన్ని తరిగివేయి నే నీ లోపున అన్నం పప్పుపొండి పారనేస్తా అని యిన్ని కూరగాయలు వాడిముందుపారేసి, బియ్యం పప్పుకడుక్కొని పొయ్యవెలిగించి అందుపెట్టేడు. పక్కనాకుంచినేటట్లు: "ఒసే బోలా, యికనీవు నేటినుండి నా నౌకరువు నీవు ఇక్కడదాక వెళ్లక అక్కడనుండి యీ యింటిలో కాయమెప్పుడైనా పెట్టితే చూసుకోక నీకు చెప్పుతువున్నా అం, ఓ నృత్తికాళి యీలా పొకతూరి రా!" అనికేక పెట్టేడు. రామ్‌బాబు.

నారాయణి వంటింట వసారాలో కూర్చొని తలవంచుకు పనిజేసుకుంటూ వింటూనేవుంది.

దిగంబరి సురభలు మచ్యతడికల కన్నములోనుండి కుతుహలముగా రామ్‌జేసే ప్రతిపని చూడసాగి విరగబడి నవ్వుతూవున్నారు. ఒక్కక్షణం పోయేక దిగంబరి పెద్దకూతురు వద్దకు వచ్చి నవ్వునాపుకొంటూ, "చూచేవే నాయాణి, ఆహా యేమి తెలివేవాడిది. అతగాడు మంచి మంచి కూరలు చేపలు వండుకు తింటాడట! ఒకగిన్నెలో శేమబియ్యం కడిగిపోసి కాసిని నీళ్లువేసి పొయ్యిమీద కెక్కించి వూదుతున్నాడు పొయ్యి! తినేది వొకడు వండేది పదిమందికి సరిపోయే టంతా పైగా తవ్వేడు బియ్యం వుడికేదానికో శేమ యేలా వుడుకుతుందో తెలియదు. వహ్వా యేమిటి అతని ధైర్య సాహసములు బియ్యం పూడి బొగ్గయితా యన్నమాటలేదు. వంట మాత్రం పెడుతున్నాడు పెద్దికేకలేమిటో అర్థంగాదు. అతనివంటా పెంటాను. అంతదానికే యేక గర్వంతో బోరవిరుచుకొంటూ వున్నాడు. యీ గర్వం యేమిటో మాకు

తెలియదమ్మా మేము వంటజేశాముగాని ఇన్నినీళ్ల సమానకొలత ప్రకారము పొయ్యిమీదకెక్కిస్తే మళ్ళా ఆ దిక్కు చూడాలా! కళ్లుమూసి తెరిసేసరికి తయార్ కావలసిందే యేదీ నాతో వండ మను చూద్దాం వాడివంట బావుంటుందో నా వంట బావుంటుందో పందెం వేద్దాం నలుగురిచే తినిపించి ప్యాస్ జేయిద్దాం" అంది.

నారాయణి యీ మాటలు అసహ్యేందోపగా అటు మొఖం త్రిప్పుకొంది.

నృత్యకాళి అంట్లు తోముకుంటూ అక్కడికూర్చుని యీ మాటలన్నివిని "చాల్లెండి పెద్దమ్మగారూ మీ రెప్పుడూ ఒక్కటే మాట ఆయన యెప్పుడైనా గ్లాసుడు మంచినీళ్లు ఆయనంతట ఆయన ఎత్తుకుత్రాగి యెరుగడు కాని, యీవేళ వంటజేసుకు తింటాడా?" అంది.

నృత్తికాళి చాలారోజులనుండి ఆయింట దాసిగాజేరి పని చేసుకుపోతుండేది. అన్ని సంగతులు ఆమెకు బాగా తెలుసు నిన్న టినుండి జరుగుతున్న వ్యవహారముదానికి చాలా కష్టముగావుంది.

దిగంబరి తను జూస్తూండమేగాక తన చిన్నకూ తుర్ని తడకసందునుండి యేం జర్గుతుందో చూడమని మద్యమద్య పొడుస్తువుండేది. ఆమెవెళ్లి జూస్తు ఒకగంటయాక పరువెత్తుకొని వచ్చి నారాయణి చెయ్యిపట్టుకొని "చూడవేఅక్కా! రామ్‌బావ ఉడికీ ఉడకని అన్నం యేలా తినేస్తున్నాడో. పాపం అలా తింటే కడుపునొప్పిరాదే!" అంది.

నారాయణి తనచెయ్యి విడిపించుకొని తనగదికిపోయి మంచంపై పడుకుంది. రామ్‌బాబు. ఎంత దుఃఖంతో ఆకలి మంటను

చల్లార్చుటకు ఆ వుడికీ వుడకని బియ్యం తింటూవున్నాడో ఆమెకు తెలియని విషయంకాదు.

మధ్యాహ్నం శ్యామ్‌లాల్ కచ్చేరీనుండివచ్చి భోజన మయేకా దిగంబరి నారాయణి "లేచిరాఅమ్మా రెండుమెతుకులే తిందువుగాని ఎక్కువతినక్కరలేదులేతల్లీ! ఆ పాడుదెబ్బకు జ్వరంవచ్చి వుంటుందిలే దానికని అన్నం మానుకుంటారా! అట్టి జ్వరాలకు అన్నంతినవొచ్చు నే చెప్పుతున్నానుగా! భయంలేదు తల్లీ ఒక్కనాటికేయేలా అయిపోయేవురా అమ్మా రా" అంది.

నారాయణి దుప్పటిముసుగు పూర్తిగాపెట్టుకొని పడుకొనే "నన్నెట్టే విసిగించకేఅమ్మా! మీరువెళ్లితినండి అంతేగాని నే నిప్పుడురాలేను" అంది.

పోనీ అన్నం అక్కరలేకపోతే పోయేగాని నాలుగు రొట్టెలు జేసియిస్తా అవన్నాతిను లేకపోతే చిక్కి సగమై పోతావ్" అంది.

"వద్దు నాకేంవద్దని చెప్పుతువుంటే వినపడడములేదా?" అంది.

దిగంబరి తెల్లబోతూ "ఇదేమిటమ్మా విడ్డూరం! నిన్న టినుండి ఉపవాసంజేస్తూ యీ వేళయిన యిన్ని మెతుకులు నోట్లో పోసుకోపోతే యేలా?" అంది.

నారాయణి జవాబు చెప్పలేదు. అలానే ముడుసుకు పడు కుంది. నృత్తికాళి అక్కడకువచ్చి - యెందుకు పెద్దమ్మగారు మీరు ఆలాకంత శోషపడతారు? ఇక్కడనుంచి ఒక్కపూటల్లా

పిలిచిచెప్పి వారికి తినిపించలేరు. వృదాగా ఆరవక మీరువెళ్ళి తినండి వారికి జ్వరంకూడావచ్చినట్లుంది. కాస్త నిశ్శబ్దంగా నిద్ర పోసింది " అంది

దిగంబరి విస్కుంటూపోతూ "నాకిదెక్కడిచోద్యం అమ్మా అర్థంగావటములేదు ఏదయినా దెబ్బతగులుతే కాస్తంత జ్వరంవొచ్చినట్లు వుంటుంది. ఆలాఅని అందరూ ఉపవాసాలు జేసి వస్తువుంటారా ? యిదెక్కడివిడ్డూరం మేమైతే యిలా ఎప్పుడు చెయ్యలేదు తల్లీ ?" అంటూ వంటయింటిలోనికి వెళ్లింది. సురధని తీసుకొని.

నృత్తి అక్కడనుంచి బైటికివెళ్ళింది.

సాయంకాలము నారాయణి పూజాగృహానికివెళ్ళి దేవతా దర్శనం జేసుకొని వంటయింటి వసారాలోనికివచ్చి కూర్చుంది. నృత్తికాళీ వచ్చినప్పుడల్లా ఏదోజెప్పుదామనుకొని మళ్లీ చెప్పక వూరుకొనేది.

రామ్‌బాబు స్కూల్‌నుండివచ్చి చేతులు ముఖం కడు క్కొని తను ఓ సంచితో తెచ్చుకొన్న మిఠాయి పళ్లు బైటికితీసి తింటూ, నాకేటిలోటు అంటూ గొంతపెద్దదిజేసి లడ్డు జిలేబి ఆహా ! యెంతబాగున్నాయి. మ్యధాహ్నం బోంజేసివెళ్లేను - యిప్పుడివి తింటువున్నాను " అనికేకలేయ దొడగేడు.

అటువైపున అందరూ కూర్చునివున్నారని తెలుసునుగాని వుదయములాగే యెవ్వరు మాటాడక కూర్చోడముజూచి చాలా చిన్నబోయేడు. యింకా ప్రయత్నిద్దామని "యిది నా

సరిహద్దు యిందులోనికి యెవ్వరైనావచ్చేరా చూడండి మరి యేమిజేస్తానో రెండుకాళ్లు విరగగొట్టి పారవేస్తా." అన్నాడు.

యిలాంటి మాటలెన్నిటనో ఉదయానే అన్నాడు వారెవ్వరైనా ఆ మాటలు ఖాతర్‌జేస్తేనా! అందుకువాడు చాలా అధీరుడైనాడు. చీకటి అలుముకొంటూవుంది ఆ సమయములో అరికెన్‌లైటు ఎలిగించుకొంటూ మళ్లా బిగ్గరగా, అరవడం మొదలెట్టేడు. "యేవినాకు వంటజేసుకోడానికి పుల్లలేవి? నేనెలా వంటజేసుకుంటాననుకున్నారు. నాకు రోలుయేదీ? బండయేదీ?" అని కేకలేసుకుంటుంటే, ఆవలనుండి నృత్తికాళి "యివియన్ని రేపు అమ్మగారు కొని పంపుతానంటున్నారు." అంది. "ఉహూ, నాకు కొన్నవి అక్కరలేదు" అంటూ ఏడ్చుచు బైటికెళ్లిపోయినాడు. ఒక్కక్షణంలో మరలతిరిగివచ్చి. "ఆ ముసలిదయ్యం నా గణేశునెందుకు చంపేయాలి, ఆలోజున నన్నెందుక్కు అంత అవమానపర్చుచు మాటాడాలి, అప్పుడే అయింది మళ్లి జన్మలో అది దయ్యమై పుట్టకపోతేను. ముసలివరద," అన్నాడు

దిగంబరి అక్కడేకూర్చుని ఆ మాటలన్నివిని "చూచేవా, నారాయణి యివన్నిపోట్లాటకు పునిగోల్పేటందుకుకాదూ?" అంది

నారాయణి మాట్లాడకుండా యింకోవైపుకుతిర్గి కూర్చుంది.

## — ఐదు —

ఆనాడు యేలానో ఓలా తెల్లవారిపోయింది ఉదయం నుండి రాంబాబు మాటలు పంథా పూర్తిగా మారిపోయేయి రెండురోజులు గతించిపోయేయి వదినగారు మాటలాడలేదు, తనని పిలువలేదు. యేమి తినుటకు పెట్టనూలేదు. తన ఊహవచ్చేక యీ విధముగా యేనాడు జర్గలేదు. యిప్పుడు వానిహృదయం భయంతో నిండిపోతూవుంది. నట్టింటకూర్చుని తను జామికాయ విసురుటకు యేమేమో సమాధానాలు చెప్పబోయేడు. ప్రయోజనము సర్వశూన్యంగావుంది. ఆ భాగములోనున్నవారు కిక్కురు మనుటలేదు. చివరకు లజ్జావిడియాలు వదిలేసి, ఇన్నాళ్లపట్టి యేయొక్కమాట తనను కాపాడుతోవచ్చిందో ఆ మాట "నే నెప్పుడుచేయను వదినా!" అని ప్రయోగించిజూచేడు. ఫలితము లేకపోయింది. ఆ మాటవారెవ్వరు అవుననికాని, కాదనికాని, అనలేదు. యిక యేమితోచలేదు – ఏడవడం మొదలపెట్టేడు. రాంబాబు యేలాఅయినా మా వదినను ప్రసన్నురాలుగా జేసుకుందామని, వదినతనను వేరుపెట్టింది. తను ఎక్కడ యెవ్వరివద్ద తినటం యేమి అర్థంగాక దారి తెన్నుతోచక. అల్లాడిపోతున్నాడు. ఆనాడుయిక అతను వండుకోనాలేదు. స్కూలుకు పోలేదు. కదలక మెదలక పోయిపడుకున్నాడు.

నారాయణికి లోలోన కుమిలి కుమిలి ఏడ్చుటమూలాన కాబోలు జ్వరంవచ్చినది. మధ్యాహ్నంపూట దిగంబరి వాక గ్లాసుడు పాలుతెచ్చి "యిదితాగమ్మా నీకుజ్వరం పూర్తిగావొదిలింది. యేమిపుచ్చుకోకుండా జీర్ణించి చావాలనుకుంటున్నావా? లే.తాగు" అంది. నారాయణి తల్లితోవృధా వివాదము పెట్టుకోవడము యిష్టములేక అందిపుచ్చుకొని - కాసంతనోటిలో పోసుకొని తక్కిందక్కడ వుంచివేసింది. తను అటుతిర్గి పడుకొంది. తల్లితో వాదించుటకు ఆమెకు అసహ్యామేసింది. ఆమె యీ రెండురోజులనుండి యేమితీసుకొనలేదు. జర్గిన యీ విషయము తలుచుకొంటూయుంటే గుండె బద్దలైపోతున్నట్లు వుంది.

రాత్రి తొమ్మిదయినది నృత్తికాళివచ్చి "అమ్మా చిన్నబాబు వచ్చినట్లు జాడలేదు. చాలా పొద్దుపోయింది. యెక్కడకెళ్లిరో యేమిటో నాకేం తెలియటంలేదమ్మా!" అంది.

నారాయణి చటన్న మంచంపైలేచి "యింకనూరాలేదటే. పో, నీవుజూచిరా లోనికివెళ్లి అని కళ్లనీరుగార్చుచు" అన్నది.

నృత్తి కళ్లలోనీరుగమ్మాయి. చేతితో కళ్లుతుడుచుకొంటూ "నాకు అక్కడకు వెళ్లుటకు చాలా భయముగా నున్నదమ్మా?" అంటూ బైటికిపోయి భోలాను పిల్చుకువచ్చింది. భోలా అన్నాడు "చిన్నబాబుగ్గారు యీ వేళబైటికి పోతాడు. యింటిలోనే పడుకుని నిద్దర పోతూవున్నారు." అని చెప్పేడు.

నారాయణి ఆ మాటలువిని "తండ్రీ భగవంతుడా" అని కరములుమోడ్చి అకాశముపై పుజూచి మళ్లావచ్చి ముసుగు వేసుకొని పడుకొంది.

నృత్తి. ఫోలా. బైటికెళ్లిపోయేరు.

మర్నాడు తెల్లవారుఝామునసే లేచి నదికిపోయి స్నానం జేసివచ్చి పొయ్యి ముట్టించి వంటజేయుట నారంభించింది. నారాయణి

వంట అవుతుంది. దిగంబరి మెలుకువవచ్చి జూచింది. ఆశ్చర్యపోతూ, గొంతుపెద్దది జేసుకొని "నీవు జ్వరంతో నిన్నల్లా బాదపడి యిప్పుడిదేంపనే నారాణి? నీవు మూడురోజులు లంక నంజేసి తెల్లవారలేదే అప్పుడే పొయ్యిగియ్యి ముట్టించేవా? సెహబాష్ ఎంతకైనా తగుదువే నాతల్లీ!" అంది.

"అలాజూస్తు యుండవేఅమ్మా," అంది నారాయణి.

"అలాజూవేదేంటి వండుకుంటూవున్నావు అయితే నాచేతి అన్నంతినవా? నీవు" అంది.

నారాయణి యీ పల్కులకు జవాబు యివ్వకుండా తనపని తను సాగించుకుపోతుంది.

అటుబాగములో - రామ్‌బాబు కొన్ని పచ్చిజామికాయలు తెచ్చి తన నుదురుకేసి కొట్టుకొని వదినకెంత దెబ్బతగిలినదోయని పరిక్షజేసుకొంటూ యున్నాడు ఆలోచనజేసి జేసి యీ తప్పు యేవిధంగా ప్రవర్తించిన పోతుందోయని అనుకుంటువుండేవాడు. కొంతసేపటికి 'వదినగారు నీవిక ఇక్కడ వుండవద్దునాయనా అని చెప్పినమాటలు స్ఫృహకొచ్చాయి. తను ఎక్కడకైనా వెళ్లిన వదిన సంతోషిస్తుందని నిర్ణయంజేసుకున్నాడు. తన మేనమామ యిల్లు తారకేశ్వరముపైన ఎక్కడో వుందని వొకనాడు వదిన చెప్పినట్లు జ్ఞప్తికొచ్చింది. అయితే అదియేవూరు? ఎక్కడవుందో మాత్రం తనకు తెలియుటలేదు. పోనీ ఆ ప్రాంతానికివెళ్లి వాకబ్

జేస్నీ తెలుస్తుందని ఒక నిశ్చయానికివచ్చేడు. తనబట్టలు ఒక మూటగా కట్టుకొని సిద్ధముగావున్నాడు. తెల్లవారిందే యిక యిక్కడ వుండకుండా వెళ్లిపోదామని, వెంటనే బోలాను లేపి "ఓరే బోలా, నీవు పోయి వదినను అడిగి రెండురూపాయలు తీసుకరారా, నేను తారకేశ్వరమువైపు వెళ్ళిపోతాను" అన్నాడు.

బోలా కంగారుపడిలేచి చిన్నపోయిన ముఖంతో బాబు నేనురానా" అన్నాడు - ఛీ పో నీవు ముందు అని రామ్‌బాబు గదమాయించాడు.

నెమ్మదిగా వారిగుమ్మందగ్గరకు వెళ్ళి "అమ్మా," యని పిలిచేడు. నారాయణి వెనక్కు తిరిగి "యెందుకురా బోలా యిలా వచ్చేవు "అంది.

నారాయణివద్దకువచ్చి నెమ్మదిగా "మీరన్నట్లే బాబు తారకేశ్వరమువైపు వెళ్లిపోతారట యిప్పుడు మీదగ్గర రెండు రూపాయలు అడిగి తీసుకరమ్మన్నారమ్మా" అన్నాడు.

నారాయణి త్రుళ్ళిపడి "ఆ యేమన్నావు నేను పొమ్మన్నా నా తారకేశ్వరంవైపు వెళ్లతాడా? పో బోలా అతనిని యిలా తీసుకురా! అతనెక్కడవున్నాడు." అంది

బోలా అన్నాడు "అదిగో ఆ చెట్టచాటున చిన్నమూట పట్టుకు నిలబడివున్నాడు. మేనమామగారింటికి వెళ్తానురా అని చెప్పేరమ్మా!"

"చెప్పితీసుకోవస్తా నమ్మాయని" బోలా ఆ దిశకు పరుగెత్తుకు వెళ్ళినాడు.

నారాయణి నిశ్చేష్టురాలై అలానే నిలబడిపోయింది. కొంతసేపటికి చిన్నబట్టలమూట చేత నిడుకొని రామ్‌బాబువచ్చి చెంత నిలబడగానే నారాయణి వానిచెయ్యిపట్టుకు లోనికి తీసుకెళ్ళిపోయింది.

దిగంబరి దూరమునుండి రామ్‌రాక - చెయ్యిపట్టుకు పెద్ద కూతురు లోనికితీసుకెళ్లట యిదంతా గమనించి గబగబా పెద్ద పెద్ద అడుగులేచుకొనుచు యింటిలోనికి వచ్చింది.

రామ్‌బాబుని వొళ్ళో కూర్చుండబెట్టుకొని, తల నిమురుతూ కళ్ళనీరు కార్చుతూవున్న నారాయణిని జూచి మండిపడిపోతూ అంది దిగంబరి "ఓ ఇందుకా వంటంతా తెల్లవారగట్లలేచి శ్రమ పడివండింది. యిదా అయితే నా అల్లుడు యింత పెద్ద వొట్టు వేసుకొంటే అదియంతా నిష్ఫలమే అయిపోయిందను కుంటాను." అంది.

నారాయణి మొఖం పైకెత్తి "యెందుకు తుడిసిపెట్టుకు పోతుందమ్మా! వారిమాట నే నతిక్రమిస్తేగా మూడురోజులు నే తిననూలేదు. యితనికి పెట్టనూలేదు." అంది.

దిగంబరి తీక్షణదృష్టి ఆమెపై ప్రసురిస్తు. "అతిక్ర మించక పోవడమంటే యిదేకాబోలునే? పైగా 'వారిమాటైనా పుచ్చుకోవద్దా" అని అంది.

నారాయణి - ఏదో తీవ్రమైన అఘాతాన్ని ఓర్చుకొనునట్లు సహించి. నెమ్మదిగా "నేను అజ్ఞ తీసుకున్నాను. నీ వెందుకింత మదనపడతావమ్మా!" అంటూ రామ్‌బాబుకు పల్లెములో

అన్నిపెట్టి తినునాయనా?" అంది. రామ్‌బాబు తినక - ఆమె వళ్ళో అలానే పడివున్నాడు.

దిగంబరి మహోమండిపోతూ "నే నేం పసిపాపనుకాను నారాణి నేనామాత్రం తెలుసుకోలేని మూర్ఖురాలనంటావా?" అంది.

ఈతూరి నారాయణి యీ మాటలు సహించ లేకపోయింది. కొంచెం హృదయకాఠిన్యత వహించి "నీకేం తెలుసునమ్మా! నేను ఎప్పుడైనా, యెవ్వరివద్దనైనా, యే సమయాలలోనైనా ఆజ్ఞ పుచ్చుకోవటమంటూ వుందా? వారికి చెప్పుడు మాటలుతలకెక్కి-కోపాన్ని నోరుందిగదాయని వొట్టు పెట్టుకోగలిగారమ్మా?" అంటూ లజ్జచేమొఖం పైకెత్తి వాత్సల్యత హృదయంతో "చూడమ్మా! యీ బాబుని పదమూడు వసంతాలు. నిండు హృదయంతో యిలా హృదయానికి హత్తుకొనిపెంచి పెద్దవానిని జేసెను. యిప్పుడు నే నెవరి ఆజ్ఞా యెట్లాతీసుకోవాలో తెలుసు నమ్మా నాకు అంటూ కళ్ళనుండి అశ్రువులు రాల్చుతూ యిక యివన్ని నీవు ఆలోచించి బుర్రబద్దల కొట్టుకొనక్కరలేదు, నీవు నాయందు దయవుంచి మా యెదుటనుండితప్పుకో నా బాబుకు-రెండుముద్దలు తినిపిస్తాను. మూడుదినములనుండి తిండీ తిప్పలు లేక వాడిపోయివున్నాడు నా బిడ్డడు!" అంటూ కళ్ళనీళ్ల పైట కొంగుతో హద్దుకొంది.

దిగంబరి ఒక్కనిముషం స్థిరంగావుండి, "యిక అయితే యిక్కడ ఒకక్షణంకూడా వుండలేము. యిప్పుడు నీ సంగతి స్పష్టపడిపోయింది. సురధనుతీసుకొని యిప్పుడే వెళ్ళిపోతా,"

"నేనూ యీ మాటయే నా నోటితోనే చెప్పలేక పోతు వున్నానమ్మా! యిక నీవు యిక్కడ వుండనక్కరలేదు. తల్లీ! నీ కన్నులు పడ్డాకనే. యేంతో దుబ్బుగాపెరిన మా బాబు చిక్కి సగమైనాడు. అతడు. పెంకిపిల్లవాడేగాని, చెడ్డవాడేకాని, నే బ్రతికి వుండగా నా కళ్లముందు యే శాస్తిగానివ్వను. యిది నా సత్సం కల్పమ్. నీవు యీ వేళవుండి రేపువెళ్ళిఫో నీవు యెక్కడున్నా నీకు కావలసినకర్చులు నే నెప్పటికప్పుడు పంపిస్తువుంటా. నీవు మాత్రం మాయింట నుండతగినదానవు కావుగాబట్టి యిక యుండ వొద్దమ్మా!" అంది నారాయణి.

దిగంబరి నిలువున నీరై పోయి క్షణం అక్కడ అలానే నిలబడిపోయి బైటికి నెమ్మదిగా వెళ్లి పోయింది.

రామ్‌బాబు నారాయణి హృదయాన మొఖమలానేవుంచి మెల్లగా, అవిణ్ణించువదినా? నే నిప్పుడు మంచివాడనై పోతినిగా! నాకు యిప్పుడు బుద్ధివచ్చింది. నామాటనమ్మువదినా వారిని వెళ్ళవద్దును వదినా" అన్నాడు.

నారాయణి వానిమొఖం పైకెత్తి నుదురుముద్దాడు కన్నీళ్ళ మద్య నవ్వుకుంటూ "ముందు నీవు అన్నంతిను!" అంది.

—: సమాప్తం :—

# మా స్వంత ప్రచురణములు

—: శరత్ రచనలు :—

| | |
|---|---|
| అనుపమాదేవి | 1-0 |
| చంద్రనాథ్ | 1-8 |
| స్వామి (మావారు) | 1-0 |
| వాగ్దానం | 2-0 |
| పరిణీత | 1-0 |
| బిందుగారబ్బాయి | 1-0 |
| బడీ బహన్ | -12 |
| సుమతి | -12 |

—: సాంఘిక నవలలు :—

| | |
|---|---|
| ఫాదర్ యిండియా | 1-8 |
| మదర్ యిండియా | 1-0 |
| హరిచరణుడు | 1-0 |
| సుందరి | 2-8 |
| నాగమ్మ | 1-0 |
| భిక్షుకి | 1-0 |
| గరీబ్ | 1-0 |
| డార్లింగ్ గరల్ | 1-0 |
| నీలకంఠం కథలు | 1-0 |
| కొవ్వలి కథలు | 1-0 |

—: చరిత్రాత్మక నవలలు :—

అమరవిజయం
చాందు సుల్తానా
సాహసిక వీరచరిత్ర
రుద్రమదేవి
సురస

—: డిటెక్టివ్ నవలలు :—

పాతాళగృహం
బ్యాండిట్
మర్డర్
దివిటీ దొంగలు
దండధరుడు
చండశాసని
మగపిశాచి
వింతపెండ్లి
ఖూనీపై ఖూనీ
ఎడ్డీపోలో
మాధురి
మోహినీ
తుఫాన్ మేల్

లభ్యస్థానం :

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు,**

సంస్కృతాంధ్ర గ్రంథాలయం :: రాజమండ్రి.

SUMATI
By Sarat Babu

**As 12**

Sri Rajeswari I
Rajahmundry,